చరణము.

1. ఎనదరిగళైప్పోక్కి - యిడరండంగలుంనీక్కి - ఉనదరుళ్ వెళ్లం తేక్కి - ఉళం నిళైత్తవనాక్కి---సనకసనందన సనత్సుజాత - సనత్కుమారసంతనువాత---తనయశుకజనక శౌనకసూత - కనకకశిపు తనయాదిపూత---జనంగళైప్పోలున్నై సాధిక్క సత్తమగుణంగళై అనువాదిక్క-శినమిరాజనంగళై చ్ఛేదిక్క - చ్చిన్న సామికవి ఆమోదిక్క-అనవరతంపదవనజ మనదిలుఱ---ఆశైకొండు పూజై శెయ్దు సుఖం పెఱ - అజ్ఞానంగళై క్కెల్లి - అడియోంగళైయుంపుల్లి - అభయతవచనం శొల్లి ॥ ఆద॥

అని స్తుతించి అత్యంతభక్తి పూర్వకంబుగా ననేకప్రణామంబులాచరించి తన్నేభజించుచు అర్చించుచు భావించుచు తన సన్నిధినినిలుచున్న శిష్యులకు సద్గురుండు సుముఖుడై మీకు నెయ్యది యిష్టంబు ఇచ్చెదమడుగుమనగా సంతోషభరితచిత్తులైన శిష్యులు,

పద్యము॥ ప్రాణనాథ తనదుపతినిగొల్చుటకంటె। వేరుపనులు గలవెచార్లుమతికి। గాన నీదు సేవ గావించుటయెగాని। యొండుకోర్కిలేదఖండమూర్తి॥

ఇట్లు మాకు అన్యాపేక్ష లేకున్నను మాయభీష్టమొసగెదనని ఆనతిచ్చితిరిగాన సకలజనులకు క్షేమము గలుగజేయు భక్తి యోగ జ్ఞాన మార్గములను విస్తరించి బోధించుడని ప్రార్థింప సద్గురుండు, చర్య క్రియ యోగ జ్ఞానమను చతుర్విధ క్రమముక్తిమార్గములలో చర్య క్రియలయందు విరక్తిగలిగినపిదపనే శుద్ధవైరాగ్యసహిత నిజయోగ మార్గము పట్టుబడును దీనికి శ్రీ రామచరణ కమలభక్తియే కారణంబు అని బోధింప శిష్యులు ఆర్తిజెంది,

ద్రావిడవృత్తము.

ఇక్కాయమెనుం ఓరిరుట్కాట్టినడువిలే యిన్బట్రి ఇల్ వాళ్వక్కైయాం ఇకైయట్రిమరమీది లెన్నిదయమాగుమో రెట్రిలట్రి కుఱంగడంగా

దెక్కాలం ఓడిచ్చుఅ(రుఅ(నాడియే యిన్బతున్బక్కనిగళై
యిడైయతాదుణ్ణు మిగవెరికొణ్ణుతిరిదలై యినియాగిలుం తవిర్వాయ్
పోయ్క్కాదనిన్నామ పుగఅప్పడిత్తువరుంపునిదమాం ఇన్బమదైయే
పోరున్దుంనాళెన్ద నాళన్దనాళ్లవో పోక్కువర వట్రిరుప్పేన్
ఇక్కాలమక్కాలమెన్బ దొన్రిల్లామలె(రుం వాఙ్కరుణై ముఖిత్తే
ఇమ్మైయినుం మఱుమైయినుం ఏకవురువాగియ ఇన్బవడివానపొరుళే॥

ధ్రావిడకీర్తన. రాగం-తోడి-తాళం-రూపకం.

పల్లవి.

ఇనియాగిలుం ఎనై యాదరి - యెన్దైయే రఘునందనహరి ॥

అనుపల్లవి.

తనియాం ఉన్దన్ సన్నిధానంనణ్ణి - శరణడైన్దేనెన్ సామిదయైపణ్ణి॥ ఇని॥

చరణము.

1. అనవరతముం ఉనైత్తుది శెయ్యుం-అడియేనుడన్ వాదా-మనదు కొంజముం ఇరంగాదేనో - వర్ణమెల్లామెన్ మీదా - వనందనిలగలిగై త్తుయరముం - మాట్రియమలర్ప్పాదా - ఎనదుకవలై అఱుక్కా దిరుప్పదే నిన్ పెరుమైయిాదా - దినకరకులపతినీయే - తీవినైముద్రదుం వెల్ల - గనవానె(రున్దన్ తిరుక్కలిలైత్తొడ్రదేనల్ల - ధనమదైత్తెరు వామె(రుం తన్నాడువెగువాయ్చ్చొల్ల - వినవియుం ఈయామల్ కైవిడలామో సరియల్ల - జనకిమణాళా - సుగుణాళా - దానవకుల కాలా - ఘనసమనీలా - భువిపాలా - లక్ష్మణకవిలోలా॥ఇని॥

ఇట్లు అనన్యభక్తిచే భగవంతుని ప్రార్థించిన శిష్యులను గురుండు క్రేగంటిచే వీక్షించి లోకమునందుగల జపము తపము ధ్యానము మానము భక్తి విరక్తి మొదలగునవి జ్ఞానములేకున్న నిష్ఫలమగును ఇట్టి జ్ఞానమునకు పురాణ వైరాగ్యము, స్మశాన వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము, మత వైరాగ్యము, రాక్షస వైరాగ్యము,

చపల వైరాగ్యము, అజ్ఞాన వైరాగ్యము, హఠ వైరాగ్యము, మొదలగు అశుద్ధ వైరాగ్యములు, ఆత్మతరణోపాయమునకు సహాయముచేయక పోయినను అహంకారమును అభివృద్ధిజేయించును. గాన నిట్టి అశుద్ధ వైరాగ్యములకడద్రోచి శుద్ధ వైరాగ్యమునుపొంది సుఖించవలయును.

శ్లో॥ ద్వేపదేబంధమోక్షాభ్యాం నిర్మమేతిమమేతిచ।
మమేతిబధ్యతేజంతుః నిర్మమేతివిముచ్యతే॥

అనగా నాదియని జెప్పబడెడి పదంబొకటియు నాదియని జెప్ప బడని పదంబొకటియు బంధమోక్ష కారణంబులగుచున్నవి అందు నాదియనెడు భ్రమరూప దృఢాభిమానమువలన ప్రాణులు బంధింప బడుచున్నారు. నాదియని దృఢముగా అభిమానించనివారై ప్రపంచము మిథ్యయని తెలియుటచేత సంసారబంధవిముక్తిని పొందుచు న్నారు. అహంకారము ప్రవృత్తిమార్గముననున్నప్పుడే జగములు తోచుచుండును గనుక అజ్ఞానరూపమగు ఈ అహంకారమే జగద్రూపముగనున్నది. నివృత్తిమార్గమువలన అహంకారము తొలగిపోయి నపుడు ఏదియు లేకపోవును జడపదార్థ జ్ఞానమున్నవరకు చిత్ జడ పదార్థములు రెండును ఉండును. నిర్జలస్థలమునందుబడిన సూర్య ప్రకాశమే ఎండమావులుగ గనపడినలాగున ఎదుటదోచు దృశ్యప్రపంచము చిన్మాత్రమని సద్గురుని కృపవలన దెలియబడుచుండగా జడపదార్థమే లేకపోవును. ఎండమావులను గనుగొని జలభ్రాంతి నొందిన వారు ఆ జలమునందు స్నానపానాదిక్రియలు జేయదలచి తుదకు విచారజ్ఞానముచేత తమకు గనపడినవి జలముగాదనియు ఎండమావులని దెలిసికొన్నను మరల జలప్రవృత్తిమాత్రము తొలగదు అటువలెనే ఆత్మయందు ఆరోపింపబడిన దృశ్యప్రపంచము అధిష్ఠానమైన ఆత్మకంటె అన్యముగావని తెలిసికొన్నను దృశ్యప్రపంచమును తద్వ్యవహారములును మరల గలుగుచుండును. ఇది నిశ్శేషంబుగా తొలగుటకై ఆత్మారామధ్యానమే అనవరతము జేయవలయును.

ద్రావిడకీర్తన. రాగం - అఠాణా - తాళం - రూపకం.

పల్లవి.

రామా ఇన్నం జాలంశెయ్య లామా
రమణీయధామ గమనీయనామ॥ రామా॥

అనుపల్లవి.

కోమానే నల్ల శీమానే మిగు
కోమళనే ఘనశ్యామళనే రఘు॥ రామా॥

చరణములు.

1. మున్దమొఱ్ఱిన్దిడుం మొఱ్ఱినిలైయో - అన్దమట్టుందానో అప్పుఱమిలైయో - ఉన్దనైయేనమ్బుం ఉఱుధిప్పులైయో - ఎన్దనైయాళువదెన్నమలైయో॥ రామా॥

2. ఆశైయిరుక్క పుల్లాశై యగన్రిడుమో-మాశైయఱుక్క మనస్తాపంతోడుమో - ఓశైప్పడాదిరున్దాలున్నైవిడుమో- మీశైప్పడైత్త వీరనెనప్పడుమో॥ రామా॥

3. భూమియిలున్దనై పోలేదుమన్న - కామిత్తురక్షిక్కుం కర్తనేన్రుతున్న - నేమిత్తిరుప్పదై నీయఱిన్దుంచిన్న - సామిమైయెయాళాద తామసమెన్న॥ రామా॥

ఇట్టి నిజభక్తి సహిత శుద్ధవైరాగ్యమే మంగళకరము.

శ్లో॥ మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధు సహోదరః।
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రతః॥

2. ఆశయా బద్ధతేలోకే కర్మణాబహుచింతయే।
ఆయుర్క్షీణాం నజానాతి తస్మాత్ జాగ్రతజాగ్రతః॥

3. జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః।
సంసారసాగరందుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రతః॥

4. కామక్రోధంచలోభంచ దేహేతిష్ఠతితస్కరః।
జ్ఞానరత్నాపహారేణ తస్మాత్ జాగ్రత జాగ్రతః॥

ఇట్లు రాగద్వేష కామక్రోధాది దుర్గుణవృత్తులనువిడిచి, శమ దమ ఉపరతి తితీక్ష మొదలగు సద్గుణములుగలవారై జననమరణాదుల తోఁగూడిన సంసారబంధ మేలాగున విడుదలయగును మే మెప్పుడు నెమ్మదిగనుందుము అని సుజ్ఞానుల ఉపదేశజాగ్రతనొంది ఆత్మయోగము కొరకు సద్గురునిసేవ సద్భక్తితోఁజేయ ప్రయత్నించువారికి సద్గురుని ప్రసాదములభించును.



కీర్తన. రాగం-మోహానం-జంఝూటి-తాళం-చాపు.

1. ఈజన్మమిఖదుర్లభమురా - ఓ హెూజీవ నీవేగురుబోధలే వినరా॥ ఈ॥

2. ఎన్ని జన్మంబులెత్తితివో - కన్నకన్న యోనులబుట్టి గాశిజెందితివో - నిన్ను నీవెరుగకుండితివో - ఇంతటన్న జన్మముచాల్లునని వేసరితివో॥ ఈ॥

3. దేశికులచెంత నేచేరు - ఉపదేశమిమ్మనుచు ప్రార్థించితే వారు-దోషములుఁగొట్టివేసేరు- సేవఁజేసినను మెచ్చినీచింతదీర్చేరు॥ఈ॥

4. ఒక్కడే దైవమనుకోరా-అతడే పెక్కురూపంబులై పెంపొందె వినరా - గ్రక్కున నేనీలో నెగనరా - అల్లముక్కుతుదనిక్కమాదిక్కు గన్గొనరా॥ ఈ॥

5. చక్కగా గురుసేవజేయరా - మనసుచిక్కబట్టినముక్తి చేరువైయ్యేరా - గ్రక్కుననుశాంతిగైకోరా - ఏచక్కిజూచిన పరమసంతోషమారా॥ ఈ॥

6. మువ్మాటికీమాటనమ్మ-నీవుసమ్మతిగ గురుపాదజలజముల నమ్మ - కమ్మకొనువిఘ్నములచిమ్మ - ఎంతసమ్మికొలచిన అంతనయమౌనుసుమ్మ॥ ఈ॥

7. ఎంతజెప్పిన తెలివిలేక - నీ అంతర్యమందు ఏ ఆశవిడలేక - చింతిలుటమాత్రమే కాక-ఎప్పుడెంతప్రాప్తంబౌనో అంతయాగాక॥ ఈ॥

8. ఏమిరానామాటవినవు -యాలకామక్రోధమువ్వ థాకష్టపడియేవు - ఏమిసతమనియెంచినావు - గురుస్వామిదయయుంచితే జన్మముఖరావు॥ ఈ॥

9. గురుపాదపద్మముల సేవ-ఏమరక జేసితే మహాపాని వేగావా-మరిజన్మమెత్తబోవ్యేవా-అట్టిపరమగురుకృపచేత బ్రహ్మామేగావా॥ ఈ॥

10. గంగపట్టణశివుడెతాను - ఘనుడుబంగారాంప్వాయగురుడు. పరమాత్మడేను - నింగినిండియుసాక్షియౌను - ఈయింగిత మెఱుంగువాడిలముక్తుడైను॥ ఈ॥

ఇట్టి హితోపదేశమును గ్రహించినవారై జ్ఞానవిజ్ఞానముచే వెలుంగు సద్గురు సన్నిధినినిలిచి,

పద్యం॥ చరణసేవకులకు సంసారభయమును । బాపిశ్రీకరంబు పట్టుగలిగి । కామదాయియైనకరసరోజంబు । మామస్తకములనునిచి మనుపుమీశా॥

అని తన్ను మరల శరణుజొచ్చినవారిని వీక్షించి,

పద్యం॥ వైరాగ్యంబింతటికినికారణము। ఆనందకరముగావునది అదిచేకూరిన । సమస్తమునుసమకూరుతనుదాన । పరమగురుస్వామిది సుతా॥ అని అర్చిరాది మార్గసంచారులకు,

శ్లో॥ మంత్రోలయోహఠోరాజ యోగశ్చేతిచతుర్విధః ।

అనునట్లు మంత్ర లయ హఠ రాజయోగములను చతుర్విధ యోగములలో ఏదైనను లేక అన్నియు సమకూరును అని ఆనతిచ్చి,

ధ్రావిడవృత్తము.

తాలత్తిల్ మరంగళ్ కాట్టి తనిప్పిటైకాట్టువార్ పోల్
ఆలత్తిల్ ఉడుక్కళ్ కాట్టి అరుంధతికాట్టువార్ పోల్

తూలత్రైమున్బ్రకొట్టి నూత్న్వస్వరూపమాన
మూలత్రైప్పిన్బ్రకొట్ట మునివరర్ తొడంగినారే ॥

అనునట్లు అపరిపక్వచిత్తులకు అభ్యాసయోగమనియు పరిపక్వ చిత్తులకు జ్ఞానయోగమనియు ద్వివిధంబు, అందు;

అభ్యాసయోగంబు ప్రాణాయామంబనబడును ఇది ప్రాకృత ప్రాణాయామము వైకృతప్రాణాయామము కేవలకుంభకప్రాణాయామము అని త్రివిధంబు అందు ప్రాకృతప్రాణాయామమనునదే మంత్ర యోగము ఈ మంత్రయోగము క్రియ, జపము, అజపము, స్మరణ, అని చతుర్విధంబు, అందు,

1. యజ్ఞాదులు మొదలైన కర్మములయందు వేదోక్తాదిమంత్ర ముల నోటజెప్పుచు చేతులలో పుష్పచందనాది పదార్థములచేత క్రియల నడిపించునది క్రియారూపమంత్రయోగము.

2. యంత్రవిగ్రహాది ఆరాధనములనుంచి వశ్య - మారణ - స్తంభన - మోహన - విద్వేషణ - ఉచ్చాటన - ఆకర్షణ - ఆవేశముల నెడి - అష్టకర్మముల సిద్ధికొరకు - జపింపబడునది జపరూపమంత్రయోగము ఇది నికృష్టగురువులచే యుపదేశింపబడునది. గాన వీని బుద్ధిమంతులు వదలుకోవలయును.

3. నేటిప్రొద్దుననుండి రేపటిప్రొద్దువరకు మూలాధారాదికమల అధిదేవతలైన గణపతి మొదలగువారికి 21600 హంసగాయత్రి మంత్ర జపమును సమర్పించుటే అజపారూప మంత్రయోగము.

4. శ్రీరామ - నారాయణ - శివాదినామములను రాగతాళముల తోడ భక్తితో భజనసేయుటయు ఆ శ్రీరామాదినామములను కోటి సంఖ్యగవ్రాయుట మొదలైనవి స్మరణరూపమంత్రయోగము పైజెప్పిన చతుర్విధంబులలో అజపారూప స్మరణరూప మంత్ర యోగములు ఉత్కృష్టములు.

శ్లో॥ భర్జనంభవబీజానాం ఆర్జనంసర్వసంపదాం।
తర్జనంయమదూతానాం రామరామేతిగర్జనం॥

అను తారకనామ పఠన బలంబిట్లుండుటవలన సద్భక్తులు అన పరతము,



ద్రావిడకీర్తన. రాగం - నాదనామక్రియ - తాళం - ఆది.

1. ఓ హే హారఘుపతీ యునక్కేయడుప్పైయె - న్నుఱుదియాయ్ రై ప్పదుం ఎక్కాలమో-ఏకోభిత్తిహ పరంగళుడ నైయుమఱిం-దిరుక్కుర సుఖంపెఱువదెక్కాలమో॥ ఓ॥

2. అల్లైయుమనన్దై యల్లైయాదునిల్లైనిరుత్తి - ఆనందమడైవదుం ఎక్కాలమో - పుల్లైయాంపొఱిగ్గణం బోధత్తైప్పఱిక్కామల్ - బుంధి యుళ్ళడంగువదెక్కాలమో॥ ఓ॥

3. శ్రీమాన్యదైవత్తుక్కే పరత్తువమెన్రువాదం - శెయిదుజయం పెఱువదెక్కాలమో - సామాన్యదైవంగళ్ - శరీరంగళాగైయాల్ జడం గళెన్రుతళ్ళువదెక్కాలమో॥ ఓ॥

4. ఊరిలిరుక్కుంపల దైవంగళైప్పణియ-ఓడామలిరుప్పదుం ఎక్కాలమో - వేరిల్ నీరిట్టైక్క విరుక్షుంతఴైయుమెన్ర - వివేకంకొళ్లువదుం ఎక్కాలమో॥ ఓ॥

5. పెండుపిళ్ళైగళిడత్తన్బళవావదు- పెరుమానిడత్తిల్ వైప్పదెక్కాలమో-వండుఱుంతణ్ తుళభణియుమార్బ నిరు-మలరడిచ్చేరువదెక్కాలమో॥ ఓ॥

6. శొల్లాదశొల్లై నీశొల్లియరుళక్కొండు - తూంగామల్ తూంగు వదుం ఎక్కాలమో - ఎల్లామున్మయందానెన్రువికల్ప- మిల్లామల్ పార్ప్పదుం ఎక్కాలమో॥ ఓ॥

7. కరుమధరుమంగళైక్క-ప్పిత్తు బ్బవక్కడలైకడన్దు - కరైయేఱువ దెక్కాలమో - అరుమైపెరుమై తెరియాద దుర్జనసంగం - ఆగాదెన్రొప్పి ప్పదుం ఎక్కాలమో॥ ఓ॥

8. పాడిత్తిరియుం ఇన్దపావందనైయగట్టి-ప్పరిశుద్ధనావదుం ఎక్కాలమో - నాడియున్నై వెళియిల్ తేడియభ్రమవిద్దై - నాశమాయ్‌ప్పోవదుం ఎక్కాలమో॥ ఓ॥

9. అగమమకారత్తై యడక్కినడప్పదెల్లాం - అవన్ శెయలెన్రతివదెక్కాలమో -.సుఖంపోలిరున్దాలుం అదిలుపాధికణ్డొన్రుమ్ - శొల్లామలిరుప్పదుం ఎక్కాలమో॥ ఓ॥

10. భావనైయాల్ వరుం బంధంగళైయగట్టి-ప్పరిపూరణనావదుం ఎక్కాలమో - జీవనైయాళుం దేవదేవనేయెన్రునైన్ - శేవిక్కాదిరుప్పదుం ఎక్కాలమో॥ ఓ॥

11. శొన్నదన్దవగైనడక్కుం యోగసిద్ధి-శోధనైక్కాణ్బదుం ఎక్కాలమో - చిన్నసామి యున్నుం చిన్నసామియాగి - జగత్తైయుళ్లడక్కువదెక్కాలమో॥ ఓ॥

అని యిట్లు తారకబ్రహ్మమును ఆర్తితో నిరంతరము భజించుచు ఆనందించవలయును.

శ్లో॥ వాసనాద్వివిధాప్రోక్తా శుద్ధాచమలినాతథా।
మలినాజన్మకృత్ప్రోక్తా శుద్ధాజన్మవినాశనీ ॥

అనగా బురదను బురదనీళ్లతో కడుగుకొనగానే బురద వదలనట్లును కల్లుకుండను కల్లుపోసి కడుగగానే కల్లు కంపు పోవనట్లును కర్మమార్గమున సంచరించు నిషిద్ధగురువులచే యుపదేశింపబడు పునర్ జన్మకారణమగు మంత్రాదుల జపములనువదలి శుద్ధవాసనగలవారై,

శ్లో॥ మకారంమననంచైవ త్రకారంత్రాణముచ్యతే।
మననత్రాణమిత్యాహు ర్మంత్రమిత్యభిధీయతే॥

అనగా మననమునకును రక్షణమునకును తగులక్షణములుగల ప్రణవసహిత అష్టాక్షరద్వాదశాక్షరాది మహామంత్రములే, సద్గురునిజేరి శృతిస్మృతుల ప్రమాణానుసారముగ, భవసాగరతరణోపాయమగునని గ్రహించి సుఖించవలయును.

శ్లో॥ నారాయణాత్పరోదేవో నభూతోనభవిష్యతి।
ఏతద్రహస్యంవేదానాం పురాణానాంచసమ్మతం॥

శ్లో॥ ఆలోడ్యసర్వశాస్త్రాణి విచార్యచపునఃపునః।
ఇదం ఏకంసునిష్పన్నం ధ్యేయోనారాయణస్సదా॥

అనగా సర్వశాస్త్రములను క్రోడీకరించి మాటిమాటికి విచారించగా నారాయణుడొకడే ధ్యానింపదగినవాడుగా నిశ్చయింపబడుచున్నాడని భగవత్స్వరూపుండగు వేదవ్యాసమహర్షి మహాభారతాంత్యమందు చెప్పియుండుటను యూహించి,

శ్లో॥ ఆస్తికోధర్మశీలశ్చ శీలవాన్వైష్ణవశ్శుచిః।
గంభీరశ్చతురోధీరః శిష్యయిత్యభిధీయతే॥

ఇట్టి సుగుణములుగల శిష్యులు శుద్ధభావవర్తనంబుల భక్తిజేయుచు,

శ్లో॥ నాస్తినారాయణసమో నభూతోనభవిష్యతి।
ఏతేనసత్యవాక్యేన సర్వార్థాన్సాధయామ్యహం॥

అని సద్గురునిచే పవిత్రములకెల్ల పవిత్రమైన తిరువష్టాక్షరీమంత్రరత్నమునుబొంది కృతకృత్యులై సుఖించవలయు.

శ్లో॥ ప్రణవాద్యంనమోమద్యం నారాయణపదాంతిమం।
మంత్రం అష్టాక్షరంవిద్యా త్సర్వసిద్ధికరంసదా।
ముముక్షూణాంసదాజప్యం భుక్తిముక్తిఫలంప్రదం।
వైష్ణవానాంసదాజప్యం భక్తిజ్ఞానప్రవర్ధనం॥

శ్లో॥ ఋచోయజూంషిసామాని తథైవా థర్వణానిచ।
సర్వం అష్టాక్షరాంతస్థం యచ్చాన్యదపివాఙ్మయం।
సర్వవేదాంతసారార్థ సంసారార్ణవతారకః।
గతిరష్టాక్షరోనౄణాం అపునర్భవకాంక్షిణాం॥

అనగా ఋగ్యజుస్సామ అథర్వణముల నెడు నాలుగు వేదములయొక్క మర్మమంతయు ఈ తిరుమంత్రమందు గోప్యమైయున్నది. మరియు,

శ్రుతి॥ విశ్వంనారాయణం దేవం।
,, సర్వభూతాత్మకోనారాయణః।
,, ఏకోనారాయణః నద్వితీయోస్తి।
నారంవిజ్ఞానం తదయనమాత్రయోయస్యసః నారాయణః॥

అనునట్లు చరాచరరూప విశ్వమంతయు నియమించి చేతనాచేతన సమస్తభూతములయందు నివసించి సర్వమును ప్రవేశించి వాటినెల్ల ప్రకాశింపజేయుచు సర్వసాక్షియైన నారాయణుడొకడే అతని కన్న నన్యంబేమియు లేదని నిశ్చలమైనబుద్ధి అను జ్ఞాననేత్రంబుచేగాంచి నిత్యానందముజెంది సుఖించు పుణ్యులయొక్క భాగ్యమే భాగ్యము. గనుక సచ్ఛిష్యులు రహస్యార్థములనెల్ల సద్గురుముఖముచే గ్రహించవలయును.

ఇట్టి ఉత్తమమంత్రాదుల జపయోగమే ప్రాకృతప్రాణాయామము అను అభ్యాసయోగంబు. ఇకను వైకృతప్రాణాయామమనునదే లయయోగము.



రాగం - ముఖారి - తాళం - ఆది.

1. మగువరోయోగము జెప్పేమాటకాదే - మంచి తెగువతోజూచి నకాని తెలియరాదే॥ మ॥

2. అష్టాంగయోగములు శానాకష్టమమ్మా - దానినిష్ఠ దెలిసిన వారికది యిష్టమమ్మా॥ మ॥

3. ప్రణవమేదశనాదములు బల్కునమ్మా - దానిచెంకుజెప్పబోతే శానాగలదెకొమ్మా - క్వణక్వణనిక్వణనిక్వణనిక్వణ - ఝణ ఝణ ఝణ ఝణ ఝుంతరికిటతక॥ మ॥

4. పొందుగాభ్రూమధ్యమున దృష్టినిలిపి-మనసుకుదురుగాచిద్రూపమునతానునిలచి - భగభగమంటలు భుగభుగమనితగు - నిగనిగసత్కళలగుపడుదిగులగ॥ మ॥

5. సరసులైనవారికదిసాధ్యమమ్మా - మునివరులకు అనుభవమైన మూలమమ్మా - నరవరగిరిధరహరిహరులగు స్వ - స్థిరభాస్కర శశికిరణములగుపడు॥ మ॥

6. పలికినంతకన్న శానా గలదెకొమ్మా - యోగాత్ములకుస్పష్టూరీశునకుదెలుసునమ్మా - లలనరొంబలుగెజ్జలుగలరవమున-చెలువెన్నెలలోగలయసుఖములగ॥ మ॥

ద్రావిడవృత్తము.

మిగమేనిన్నప్రాణనై అంగపానని మైయేవుగవిట్టుళ్
అగమేనిన అపాననై ఇప్రాణనిడై ఆహుతిపణ్ణి
ఇగమేయిరండుమయక్కమఱ ఇరుప్పార్ శిలర్ మట్ట్రివర్గళ్ కాణ్
తగమేనిన్నప్రాణాయామత్తె తలైనిన్నవరెన్బార్ ॥

అనగా అథస్సంచారముగల ప్రాణప్రవర్తనమునందు ఊర్ధ్వసంచారముగల అపానమును, ఉపరిసంచారియైన అపానమునందు అథస్సంచారియైన ప్రాణవాయువును, లయంబుగావించుట ఒకవిధ లయ, యోగంబనంబడును.

శ్లో॥ అనాహతస్యశబ్దస్య తస్యశబ్దస్యయోధ్వనిః।
ధ్వనిరంతర్గతంజ్యోతిః జ్యోతిరంతర్గతంమనః।
తన్మనోవిలయంయాతి తద్విష్ణోఃపరమంపదం॥

భావం॥ కొట్టబడకనే మ్రోగుచుండెడి అనాహతచక్రమందలి దశవిధప్రణవనాదములనెఱిగి, దశమనాదమెచ్చట, లీనమగుచున్నదో

అచ్చట ప్రాణాగ్రస్థితమైన చిత్కళాదర్శనముతో గూడి తద్దర్శనమునందు మనోలీనమగుటయే మరియొకవిధ లయయోగము.

ఇట్టి స్థితి బ్రహ్మవేత్తల యోగీశ్వరుల నిరంతర సాంగత్యము చేతను సద్గురువుల సదా ఆశ్రయించియుండుటచేతను లభించును.

పద్యము॥ యోగీశుమహిమలిట్లన । వాగీంద్రునకైనఅల్ల వాసవుకైనన్। భోగీంద్రపతికినైనను।యీగడవియ్యంగవశమెయీశ్వరుకైనన్॥

రాగం - దర్బార్ - తాళం - రూపకం.

పల్లవి.

శుకమునియే - పరానందసుఖకనియే॥ శుక॥

అనుపల్లవి.

ఇహపరంగళై అహం అగట్రిడుం
ఏకాకార యోగారూఢ॥ శుక॥

చరణములు.

1. పనిరణ్డాణ్డన్నెయుళిరున్దు - భగవన్నామైయెల్లావర త్తై - తనియాంపరవాసుదేవనాతర - ధరణియిలవతారం శెయ్‌ద॥శుక॥

2. లోకత్తుక్కుపకారమాగ - లోకాతీతతత్తువనూలెనుం - భాగవతత్తైప్పరిక్షిత్తనుక్కు - ప్పడిత్తుప్పరమపదం అరుళియ॥ శుక॥

3. శుద్ధనిర్గుణస్వరూపమాయెంగుం - తులంగుం అఱివుక్కఱి వాయ్‌విళంగుం - సత్తమగురువాయొత్రన్దు చిన్న - స్వామిమనత్తైత్తనక్కు ళ్లడక్కియ॥ శుక॥

బ్రహ్మస్వరూపుండగు శుకయోగివలె తన్నుఁదా విచారించు వారికే సద్గురు కృపవలన తత్ త్వం ఇట్టిదన్న నిశ్చయజ్ఞానము పుట్టుటయు అపరిమిత ఆనందమును గలుగును. కాయకష్టముచేసి ఆయాస పడినవారికే తనంతటనే నిద్రవచ్చులాగున ఆచార్యునియొక్క యను గ్రహమును శుద్ధమైన భక్తి శ్రద్ధలచేత పొందినవారికే తుర్యదృష్టి

యందుఁదగిలి బ్రహ్మమాత్రముగ ప్రకాశించుచు తనంతటనే బ్రహ్మా నందముదయించి పరవశతనొంది సుఖింతురు. ఇట్లు తమ నిజరూపమును సద్గురుసన్నిధిని తెలుసుకొన్న సచ్ఛిష్యులు నిస్సంశయముగా కృతార్థులగుదురు.

పద్యము॥ ఎఱిగినవారలెఱుంగుదు। రెఱుగరు బహుభాషలేలనీశ్వరనీ । పెంపెరుగమనోవాక్కులకున్ । గుఱిశేయఁ గొలదికాదుగుణ రత్ననిధీ॥

అని తన్నే పూజించుచు ధ్యానించుచున్న సచ్ఛిష్యులవిషయమై గురుండు మరల కరుణించి,

శ్లో॥ మనోగ్రేవసతేబిందుః ప్రాణాగ్రేవసతేకళా ।
ఉభయోర్లయతేనాదం లయయిత్యుచ్యతేబుధైః ॥

భావము॥ చెఱువులోనినీరు తూముద్వారాబయలుదేఱి పొలములలోప్రవేశించి ఆ పొలములరూపముగా నిలుచునట్టుగా చిత్తము ఇంద్రియములద్వారా శబ్దాదివిషయములలో ప్రవేశించి ఆ విషయములరూపముగా పరిణమించుటే చిత్తవృత్తియనంబడును ఇట్టి చిత్తవృత్తిని నిరోధించుటకు అష్టాంగములుగల యోగముచు గురూపదేశముచే వాడుకకు తెచ్చుకొని మనోగ్రస్థిత చిద్బిందువును ఆ బిందువందలి ప్రాణాగ్రస్థిత చిత్కళలను ప్రణవదశవిధనాదములను దర్శించి ఆలించి వాటియందు మనస్సును లయింపజేయుటయే వైకృతప్రాణాయామము లేక లయయోగమను అభ్యాసయోగము.



రాగం - నాదనామక్రియ - తాళం - ఆది.

1. యోగీయోగి బ్రహ్మానందభోగిభోగి॥ యోగి॥

2. నిలచినిటలమున గొలచి ఉభయపీఠి- గెలచిత్రిభువనము గెలచినవాఁడే॥ యోగి॥

3. జననమరణస్థితి స్మరణమరచిగురు-చరణస్మరణయుగ సరణి వివేకి॥ యోగి॥

4. విడచిప్రకృతిమతి గడచివిషయరతి-నడచిక్రియనుగతి తుడచి నహాడే॥ యోగి॥

గురునిచేత నిర్ణయింపబడిన పత్యములనుజేయుచు అధోమల ములను వక్షస్థల కంఠగత పిత్తాదులను కపాలనాసికలయందలి దుష్ట జలమలాదులను విసర్జించుచు కాయశుద్ధియు, స్థిరాసనుడై మూలబంధ ఉడ్యాణబంధ జాలంధరబంధములతోడ ప్రాణవాయునిరోధనముచేసి కాయసిద్ధినిపొంది, ఆకాశగమన దూరదృష్టి దూరశ్రవణ ఘుటికా పాదుకాసిద్ధులను అణిమాది అష్టమహాసిద్ధులను స్వేచ్ఛామరణాదు లను గలిగియుండుటయే కేవల కుంభకప్రాణాయామమను హఠ యోగము.

ఈ హఠలయయోగములు యమ, నియమ, ఆసన, ప్రాణా యామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులనెడు ఎనిమిది అంగములుగలదియగును. అందు,

యమలక్షణములు.

అహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము, బ్రహ్మచ ర్యము అనునవియే పంచయమములు; అనగా జంతుహింసచేయుట, అసత్యమాడుట, పరధన అపహరణము, దానపూర్వకముగా నొసగ బడునది గ్రహించుట, వ్యభిచరించుట, ఇవి అనుచితములని పరిత్యజిం చుటయే యమమనబడును. ఇట్టి హేయగుణములు ఏ భగవంతుని సంస్మరించినమాత్రమున స్వయముగా సన్యాసమునుబొందునో ఆ ఆత్మా రాముని సదా,అనన్యభక్తితో భజింపవలయు.

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయవేదసే।
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయేనమః ॥

2. ఆపదామపహర్తారం దాతారంసర్వసంపదాం।
లోకాభిరామంశ్రీరామం భూయోభూయోనమామ్యహం॥

3. ఆర్తానాం ఆర్తిహన్తారం భీతానాం భీతినాశనం।
ద్విషతాం కాలదండం శ్రీ రామచంద్రం నమామ్యహం ॥

4. అగ్రతఃపృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చమహాబలౌ।
ఆకర్ణపూర్ణధన్వానౌ రక్షేతాంరామలక్ష్మణౌ ॥

5. సన్నద్ధఃకవచీఖడ్గీ చాపబాణధరోయువా।
గచ్ఛన్మమాగ్రతోనిత్యం రామఃపాతుసలక్ష్మణః ॥



ద్రావిడకీర్తన. రాగం-నాదనామక్రియ-తాళం-రూపకం.

పల్లవి.

ఇన్నంయమాయమా - రామా - ఇదువుంన్యాయమా॥

అనుపల్లవి.

పన్నగశయన పంకజనయన॥ ఇన్న॥

చరణములు.

1. వహిక్కకూడాదమాయై సట్రిడైన్దుం - సహిక్కకూడా మల్ శరణం అడైన్దుం॥ ఇన్న॥

2. కామాదిగళోరాటుం రామావెనపోమెన్రు-శ్రీమాన్గళుక్తైదు పోయ్యామా ఇదువెగునన్రు॥ ఇన్న॥

3. దాసలక్షణమిదెన్రు తమియేశరణెన్రది - ఈశలక్షణమిదెన్రతిన్దేన్ ఇప్పడియాశేది॥ ఇన్న॥

4. ఇనిమేలుంశోధిత్తాల్ ఎళ్ళళవుం యాన్తాళేన్ - తనియే నీవన్దు సమాధానంశొల్లినుంకేళేన్॥ ఇన్న॥

5. సుకుమార మిగుధీర - వెగుశూర రఘువీర॥ ఇన్న॥

6. పన్నగాశనాధిరూఢ-నిన్న పాంగపార్శ్వతున్న - ఉన్నదాస్సై యీయరక్క - చ్చిన్న సామిమీదిలెన్న॥ ఇన్న॥

నియమలక్షణములు.

శౌచము, తపస్సు, సంతోషము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అనునవియే పంచనియమములు; అనగా బాహ్యాఅంతరశుద్ధియు, త్రివిధతపస్సును, ఆపద శుభలభ్యములయందు సమభావముచే మనోల్లాసముగనుండుటయు, అందరు వినులాగున చదువుట అనువాచిక ఇతరులు వినకుండునటుల తానే చదువుట అను ఉపాంశువు మనసున జ్ఞాపకమునకు తెచ్చుకొనుట అనుమానసిక ఈ త్రివిధస్వాధ్యాయమును, తన గురూపదేశ భగవన్మూర్తిని తన హృదయమందుంచుకొని ఆరాధించుటయును ఈశ్వరప్రణిధానమును, ఇవియే పంచనియమములనంబడును. ఇట్టి నియమములతో సద్గురు భక్తిగలవారై గురూపదేశ దేవతామంత్రమును జితేంద్రియులైజపించుట వలన నా దేవత ప్రత్యక్షమై సర్వాభీష్టసిద్ధినిఁ గలుగఁజేయును.

శ్లో॥ జన్మాంతసహస్రేషు తపోధ్యానసమాధిభిః।
నరాణాంక్షీణపాపానాం కృష్ణేభక్తిప్రజాయతే॥

శ్లో॥ ఏకోపికృష్ణశ్చసకృత్ ప్రణామో - దశాశ్వమేధేనఫలేనతుల్యః।
దశాశ్వమేధేనపునరేవజన్మా-కృష్ణప్రణామోనపునర్భవాయా॥

అనునట్లు సూర్యకిరణములచేత మిగులదట్టమగు చీకటియెట్లు నశింపుచున్నదో యటువలెనే జనన మరణలక్షణ సంసారకారణమగు అజ్ఞానాంధకారము కృష్ణపరమాత్మయనెడు సూర్యునియొక్క భక్తి స్నేహ వైరాగ్య జ్ఞానములనెడు ప్రభచేతనే నశించునుగాని యితరసాధనములచే నశింపదని దెలిసి ఆత్మజ్ఞాన సంపదనొంది సుఖించువారికి సమస్తమంగళమస్తు.



రాగం - కల్యాణి - తాళం - రూపకం.

పల్లవి.

గోపాలా పాహీ - రాజగోపాలాపాహీ - మాంపాహీ॥

అనుపల్లవి.

శ్రీప భూప వరచోళపురాధిప॥ గో॥

చరణములు.

1. అంగజజనక విహంగతురంగ-సుమంగళాంగ భవభంగసత్సంగ॥గో॥
2. పాలితభక్తకుచేలకనకమయ-చేలకరుణాలవాలసుశీల॥ గో॥
3. క్రూరాసురసంహారనవమణి-హారనీరదాకారసుకుమార॥ గో॥
4. మందరధరణపురందరప్రముఖా-బృందారకవందితగోవింద॥ గో॥
5. భాసమానకైలాసవాసనుత-వాసుదేవరుక్మిణీశసుదర్శన॥ గో॥

శ్రీకృష్ణపరమాత్మ జగన్మోహన దివ్యమంగళ స్వరూపుండై నందున,

పద్యము॥ నీవడవిన్నగల్గిరుగ నీకుటిలాలకలాలి తాస్యమిచ్ఛా విధిఁ। జూడకున్న నిమిషంబులుమాకు యుగంబులెచనుఁ గావునఁ। రాత్రులైననిన్ను కన్నుల నెప్పుడుజూడకుండఁ లక్ష్మీవర। ఱెప్పలడ్డముగ జేసెని దేలవిధాతక్రూరుడై॥

పద్యము॥ హృదయేశ్వర మాహృదయము। మృదుతరముగ జేసి తొల్లిమిక్కిలికడనీ। హృదయము కఠినముజేసెను। మదీయసౌభాగ్యమిట్టి మందముకలదే॥

ఇట్లు గోపికలు శ్రీకృష్ణునియందు ఆర్తిజెందినట్లు సద్గురుని యందు నిశ్చలభక్తిజేయువారికి నిస్సంశయముగ బ్రహ్మప్రాప్తిగలుగును.

శ్లో॥ కృషిర్భూవాచకశ్శబ్దో ణశ్చనిర్వృత్తివాచకః।
తయోరైక్యంపరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే॥

అనగా ఎవనిచేత మనస్సు ప్రేరేపింపబడి విషయముల నెల్ల గ్రహించుచున్నదో ఎవనిచేత ప్రాణము మహా ప్రియముగానున్నదో

ఎవ్వనిచేత నోర్తు పలుకాడునట్లును కన్నులు చూచునట్లును చెవులు వినునట్లును చేయబడుచున్నవో ఆ పరబ్రహ్మమైన ఆత్మారాముడే మనస్సునకు మనస్సుగాను, ప్రాణమునకు ప్రాణముగాను, వాక్కునకు వాక్కుగాను, కంటికి కన్నుగాను, చెవికి చెవిగాను, సకలమునకు మూలకారణంబై యిట్టి చతుర్దశవ్యాపారములకు సాక్షియై స్వయం ప్రకాశమై వెలుంగు పూర్ణానందస్వరూపుడే కృష్ణపరమాత్మ. ఇట్టి స్వాత్మారామునియందు ఐక్యమగు విజ్ఞానసంపదనొంది సుఖించవలయును. పైజెప్పిన స్వాధ్యాయత్రివిధములలో,

పద్యము॥ అందువాచికజపమున కధికతరము। పాంశుజపము యుపాంశుజపమున కధికతరము। మానసజపముగు దానికధికతరము।, లేదని తెలియుము మోక్షధర్మనిరత॥

అనియున్నందున సద్భక్తులు తమ మానసకమలమునందు,

శ్లో॥ యథాసర్వేషు దేవేషు నాస్తినారాయణాత్పరః।
తథాసర్వేషుమంత్రేషు నమంతోష్టాక్షరాత్పరః॥

అను ప్రమాణమునననుసరించి ఈ దివ్యమంత్రమును సద్భక్తులో సదాస్మరించినయెడల,

శ్లో॥ నారాయణేతియస్యాస్తే వదనేన్నామమంగళం।
నారాయణ స్తమన్వేతి వత్సంగౌరివవత్సల॥

అనగా నారాయణ అనెడు మంగళనామము ఎవరివాక్కుయందుండునో వారివెంట నారాయణుడు గోవు దానిదూడను అనుసరించినట్లు అనుసరించియుండును.



ధ్రావిడకీర్తన. రాగం-హిందూస్థానికాపి-తాళం-రూపకం.

పల్లవి.

కట్టుడ్డానా - కణ్ణన్ మణివణ్ణన్ - కట్టుడ్డానా॥

అనుపల్లవి.

ఎట్టుకురత్తైయుం ఎణ్ణుం శోక్కుభాయ్
ఇష్టంనిత్తైవేర ఇవన్ అజ్ఞాపోయ్॥ కట్టు॥

చరణములు.

1. వరభాగ్గియవతి శోదైయాలె-యురలిలే కట్టుణ్డదుపోలె॥కట్టు॥

2. కణ్ణైక్కణ్డాన్ కణ్ణన్ కాణాదదేవన్-మణ్ణైక్కుమెట్టాదమహా నుభావన్॥ కట్టు॥

3. మనంకువిన్దు వరవరనాన్ - ఎనదట్ట్రివరిడం తఙ్గుంతాన్॥క॥

4. చిన్నసామియుళ్లం శేర్న్దవనెన్రు - చొన్నసామిగట్కుం సులభన్ ఇన్రు॥ కట్టు॥

ఇట్టి నియమమే స్వాధ్యాయమనంబడును.

ఈశ్వరప్రణిధానము.

పద్యము॥ కరణంబులఖిలోపకరణంబులనుగాఁగ - ప్రాణంబులుపచారభటులుగాఁగ। గంగాప్రముఖనాడికలుజలంబులుగాఁగ - షట్కమలములు పుష్పములుగాఁగ। జఠరాగ్నిహోత్రము జ్వాలధూపముగాఁగ-పటుజీవకళలుదీపంబుగాఁగ। నందితానందంబునైవేద్యముంగాఁగ-రవిశశిజ్యోతులారతులుగాఁగ॥ నంగదేవాలయమునసహస్రకమల। పీఠమునశాంతి జనకజోపేతుఁడగుచు। చెలగుపరమాత్ము రామునర్చించుచుంట। తత్వవిధులీశ్వరప్రణిధానమండ్రు॥

భావము॥ జ్ఞానకర్మేంద్రియ అంతరింద్రియములను పూజాపాత్రములుగాను, దశవిధప్రాణములను పనివాండ్రుగాను, గంగాయమునా సరస్వత్యాదినామములుగల ఇడ పింగళ సుషుమ్న మొదలగునాడులు అభిషేకజలముగాను, మూలాధారాదిషట్కమలములు పుష్పములుగాను, జఠరాగ్ని ధూపముగాను, చిత్కళలు దీపముగాను, బ్రహ్మానందము నైవేద్యముగాను, సూర్యచంద్ర అగ్నిమండలజ్యోతులు ఆరతులుగాను, శరీరమనెడిదేవాలయమందలి సహస్రారకమలమనెడి సింహాసనమున శాంతియను సీతతోఁగూడిన పరబ్రహ్మమగు శ్రీరాముని నెల్లప్పుడు పూజించుచుండుటయే ఈశ్వరప్రణిధానము.

శ్లో॥ నమో వేదాంతవిద్యాయ నిత్యసత్యానుసారిణే।
శ్రీ మోక్షలక్ష్మీనాథాయ శ్రీ రామబ్రహ్మణేనమః ॥



రాగం - పంతువరాళి - తాళం - రూపకం.

పల్లవి.

జ్ఞానజానకిస మేతా-సదాతీత॥ జ్ఞాన॥

అనుపల్లవి.

దానందరుమమూనపెరుక్కుం - పోనపిన్ ఉళవానత్తిరుక్కుం॥ జ్ఞా॥

చరణములు.

1. నాదవప్రీతనై యోచిక్కుం - నల్లమతియొడు నేసిక్కుం - సాధుజనంగళ్ విశ్వాసిక్కుం - దహరవెళియిల్ ప్రకాశిక్కుం॥ జ్ఞా॥

2. వేదక్కలప్పై యుళమెనుంశొన్ద-మిథిలైయిల్ ఉద్భంబోదు తగున్ద-సాధకం శెయ్యు అటివెనుం ఇన్ద-త్తంగపెట్టియి లిరున్దువన్ద॥ జ్ఞా॥

3. పరమకోపియెన్నుందండ-పాణిభయ త్తైనీక్కి అండ - శిరము మిల్లామల్ తెళిన్దుకణ్డ - చిన్నసామినైయె యడుమైకొణ్డ॥ జ్ఞా॥

ఇట్లు పంచయమములను పరచనియమములను చక్కగా ఆచరించుచు గురుసేవారతులై,

ఆసనలక్షణం.

పద్యం॥ వామాంకంబున దక్షిణాంఘ్రియును తద్వామేతరాంకంబునన్ । వామాంఘ్రిన్ ఘటియించి పశ్చిమదిశావ్యాప్తంబుతాచేతులన్ । నేమలబారగకాళ్ల అంగుళములజేకొన్న పద్మాసనం। బాముక్కోనజూపునుం జుబుకహృద్వ్యాసంగమున్గల్గినన్ ॥

అనగా ఎడమతొడమీద కుడిపాదముసు కుడితొడపై నెడమ పాదమునునిచి, వెనుకప్రక్కగ కుడిచేత నెడమతొడమీదనున్న కుడి కాలి పెద్దవ్రేలును, ఎడమచేత కుడితొడమీదనున్న ఎడమకాలి పెద్ద

వేళ్లును పట్టుకొని ఱొమ్మునగడ్డముంచి భూమధ్యమందు దృష్టిని నిల్పుట పద్మాసనంబనబడును.

ఇట్టి పద్మాసన, స్వస్తికాసన, వీరాసన, సింహాసన, కూర్మాసన మొదలగు 84 ఆసనములలో ఎవ్వరికెదిసుఖకరమో దాని నభ్యసించుట ఆసనమనబడును.

## ప్రాణాయామము.

ఉచ్ఛ్వాసనిశ్వాసములను నిర్ణయప్రకారము నిరోధించుట ప్రాణాయామమనబడును. నాసికమునుండి వెలుపలికివదిలెడు శ్వాసము రేచకమనియు, లోనికి లాగుశ్వాసము పూరకమనియు, లోన నిలుపు శ్వాసము కుంభకమ్మనియు జెప్పుదురు.

పద్యం॥ ప్రణవపంచాక్షరాష్టాక్షరాది। కములమాత్రగాజేసి పూరకమాత్రలక్షును। రెట్టికుంభకమునిల్పి రేచకంబు। నాడిశోధనములుచేయంగవలయు ॥

అనగా 16 మాత్రలకాలము రేచించునట్లును 32 మాత్రల కాలము పూరించునట్లును 64 మాత్రలకాలము కుంభించునట్లును నిర్ణయించి ఆ నిర్ణయప్రకారము ప్రతిదినముతప్పక జేసినయెడల రేచక పూరకములువదలి కేవల కుంభకమునందుమాత్రము నిలుచును ఇట్లు పరిపక్వమైన చిత్తమునకు ఎక్కడనిలిపిన అక్కడ నిశ్చలముగనుండు శక్తిగలుగును.



రాగం - ముఖారి - తాళం - ఆది.

పల్లవి.

చూడుబ్రహ్మమునీలోచూడు-ఓమంచిమనసా॥ చూడు॥

అనుపల్లవి.

చూడుబ్రహ్మమికసూటిగవెలిగే - ఆనందంబున ఆసద్గురునిక॥ చూడు॥

చరణములు.

1. అకారముననంటిచూడు - అందులోనాదం - ఉకారమున ఉడిగిచూడు- ఉడిగినవెనుక-మకారమున అందెనసుచు! ఆనందంబొందగ

శ్వాసంబునని శ్వాసములోపల - ఆవలయావల దోవలబోవక-ఏకమార్గమున ఎక్కిజూడుమిక చక్కనిజీవుని॥ చూడు॥

2. ఇడపింగళయనునాడి - ఈరెంటినడుమ - వీణతంతులబోలు నాడి - మేలైనపుష్పంబోలువాసనగలనాడి। షట్చక్రంబులసాధకంబున- వేయురేకుల వెలిగేపద్మం- నాదబిందుకళలుండేతావున- నాగస్వరములు బలికేవిధమున - నాళమధ్యమున నాదబ్రహ్మము - కనివినియిక సద్గురుని బోధము॥ చూడు॥

౩. ఆధారంబున అణిగిచూడు-ఆదోవలోనే-వింతనొక్కటినేడు గంటి। కంటినిసద్గురునికమలముపై-ముక్కంటివిధంబున మూడక్షరముల- ఆపరివిధమున పలికేప్రణవము-అక్కడఖండ జ్యోతులువెల్గగ-ఆహెచ్చరికగ ఆత్మలోపల - కన్నులుచల్లగ కంటినిజీవుని॥ చూ॥

పద్యం॥ సోముదెసగాలిగొనుచు సుషుమ్నబట్టి। సూర్యదెస వీడి క్రమ్మరసూర్యవలని। పింగళంబునగొనిపట్టి విడవనిగుడ। విడువ వలయు యథాశక్తినుడుగకెపుడు॥

అనునట్లు ఎడమముక్కున ప్రాణవాయువును గురూపదేశ మంత్రముతో పూరించి సుషుమ్నయందునిలిపి కుడిముక్కునవిడిచి, మరల కుడిముక్కునపూరించి సుషుమ్నయందునిలిపి ఎడమముక్కునవిడుచుచు, నాడియందలి వింతలజూచుటే వేరొకవిధ ప్రాణాయామము. ఇట్టి అభ్యాసముచే యోగసిద్ధిగలవారు వార్ధక్యాది వ్యాధిమృత్యు భయములులేక సుఖింతురు.

## ప్రత్యాహారము.

ఇంద్రియములనెల్లను విషయములయందు జొరనీయక వానిని స్వస్థలములయందు నిలుపుటే ప్రత్యాహారమనబడును.

పద్యము॥ కూర్మమఖిలావయవములన్ కుదియనుడుచు। మాడ్కిన్ ఏయోగియింద్రియమానసములన్। అమరమరలించున్ ఇంద్రియార్థములవలనన్। ఆతడాత్మస్థితప్రజ్ఞుడగుమహాత్మ॥

ఇట్లు చతుర్దశయింద్రియములను తదింద్రియ వ్యాపారముల నుండి త్రిప్పి నిశ్చలముగనుండు శిష్యులు సద్గురుని పూర్ణానుగ్రహము నకు పాత్రులగుదురు.

శ్లో॥ చాతుర్యవాన్వివేకీచ అధ్యాత్మజానవాక్ శుచిః ।
మానసంనిర్మలంయస్య గురుత్వంతస్యశోభతే ॥
ఇట్టి బ్రహ్మజ్ఞానులగురుత్వమే ప్రకాశించును.



ద్రావిడకీర్తన. రాగం-నాదనామక్రియ-తాళం-ఆది.

పల్లవి.

కబీర్ దాసర్ సీరే-కడైత్తేఱుంవగైచొల్వీరే ॥ కబీ ॥

అనుపల్లవి.

అభీతరాయుడుత్తవర్ నిత్తెక్కప్పారియుం
అరుళ్ పెట్రివరేక్ బద ట్కడ్డియుమ్ముణ్డో తెరియుం॥ క॥

చరణములు.

1. నదీజలత్తిల్ మీందు - నడక్కి అవిద్దైయుమ్మోనణ్ణుంబోదు - అతీతజ్ఞానిసీరనోర్రి పారుంపారుం - అడియేన్ భాగ్గియం - అగప్పట్టీర్ వారుం వారుం॥ క॥

2. సాధుసేవైదుర్లభం - దాశరథియినడుకరుణై శుభం - ఈదుసందేహమిల్లై యినియెనక్కేడార్ - ఇప్పడిక్కొత్తవుమ్మై ఎవర్దాక్ తేడార్ ॥ క॥

3. ఆమ్మైయడక్కుంవగైపోల్ - ఐందిందిరియంగళైయడక్కియ దాల్-శీమ్మైయిలుమక్కీడు తేడినుంకిడైయాదు-చిన్నసామియేమెన్నై రై తప్పాదు॥ క॥

వచనం॥ కబీరుదాసులవంటి బుధోత్తములు సంసారమందుండి నను తద్గుణదోషంబులచే నంటబడకనేయుందురు.

పద్యము॥ తరుణివేషంబుఁ గైకొన్న పురుషుఁడరయన్ । పురుషుఁడగుఁగాక పరికింపన్ తరుణియగునె। జీవభావంబుఁజేకొన్న కేవలాత్ముఁ । డాత్ముఁడగుఁగాక మఱిజీవుఁడగునె తెలియ ॥

అనగా స్త్రీ వేషధారియైన పురుషుఁడు స్త్రీ చిహ్నితములైన విరహతాపంబులంబొందినట్లు అభినయము గనపరచుచు నవ్వేషంబుచే నుండినను తాను పురుషుఁడను దృఢజ్ఞానముఁగల్గి అవ్వేషమందు నిరభిమానియైయుండుటచే తద్గుణంబుల నంటకనేయుండునట్లు, జ్ఞానులున్నూ తాము ఆత్మస్వరూపులమను అపరోక్షజ్ఞానముచే ప్రకాశించుటవలన సంసారమందున్నను తద్గుణదోషంబులచే చలింపక ఎప్పటికి బ్రహ్మమందే దృష్టినుంచియుందురు.

ధారణాలక్షణము.

మూలాధారాదిసహస్రారములు అనెడు కమలములయందు వాటికి నధిదేవతలైన గణేశాదిగురుచరణములను అక్కడక్కడ ధ్యానించునపుడు నిశ్చలముగా చిత్తమును గుప్తముగానిలుపుటే ధారణయనబడును.

పద్యము॥ యోగాభ్యాసమువలనసద్గతి । చిత్తేంద్రియముల దర్పములడగున్ । రాగద్వేషాదులుచనుబాగుగ । నాత్మకు సుఖానుభవముంగలుగున్ ॥

ధ్యానలక్షణము.

హృదయపద్మమందు తటస్థలక్షణస్వరూపుడైన విరాట్పురుషుని నిలిపి తద్ధ్యానమునకు వ్యతిరిక్తములగువిషయములను ధారణాస్థలమునందు పోనీయక జాగ్రతగలిగి ధ్యానించెడి స్వరూపమునుమాత్రమే స్థిరముగాభావించుట ధ్యానమనబడును;—

శ్లో॥ శ్రీమద్భక్తజనౌఘచిత్తనిలయం చిద్రూపదృగ్గోచరమ్। దత్తాత్రేయకులాబ్ధి పూర్ణశశినంస్మేరాననంచిన్మయం । నిత్యం సత్యం అనంతం అవ్యయపదం నిర్ధారణం కారణం । శాంతో దాంతక్షమాధిపం గురువరం శ్రీరామబ్రహ్మాంభజే॥

ధాౖవిడకీర్తన. రాగం - పంతువరాళి - తాళం - ఆది.

పల్లవి.

శుద్ధసత్వగుణదుౖరైయేరఘువీర - శూరాధిశూర
సుందరాంగకరుణాపారావార॥ శుద్ధ॥

అనుపల్లవి.

నిత్తనిత్తమన్నుట్టిౖ భక్తదురి-తత్తైనీక్కి-పరతత్తువత్తై త్తెరివిత్తు
మతిశయసుఖత్తైపెట్టిౖహరి-చిత్తమొత్త ప్రసిద్ధ మెత్తపరి॥ శు॥

చరణములు.

1. అడియిల్ శరణడైయుం అడియిలిరక్షిప్పెనె - నడియిలుౖరైత్త దప్పడి-పడియిలెవ్వుయిరుక్కుం పడి అళిప్పవ-నిప్పడి శెయ్దాలెప్పడి।వడిత్తు వడిత్తుప్పలవాఋకళడుళిన్ద-పడిత్తుప్పడిత్తుగన్దపడిప్పావరంపిన్ద- నడిత్తునడిత్తుం ఆనందశబరిమున్ద-కడిత్తుక్కడిత్తువైత్త కనియుణ్ణరుళవన్ద॥ శు॥

2. కోశికమునివనుం కుఋముునివనుం ఆది-గురువెనుౖన్నైమదిక్క-వాశిష్ఠరుంవశిష్ఠమునివనుం అవరభి-మతంసరియెనుౖతుదిక్క।దూశిల్లాదభూసురరుం ఉరైక్క-వల్ల-తేశిల్లారిదయుం శివనిడమే శెల్ల-మాశిల్లాదభృగుమామునికణ్డుశొల్ల-కాశినిదనిల్ మునిగణజ్గళుగన్దనల్ల॥ శు॥

3. వన్నమిగుం వలదుపొన్నడియినై యొరు-వానరమేన్దుంతుౖరై. ఇన్నమోరడియై యెనదు మనక్కుఱ-జ్జేన్దిడిలెన్నకుఱై। మన్నుమణిగళుఋం వారధిప్పడిక్కొణ్డ-మన్నరుం అమరరుంవణజ్గిడుం గెడిక్కొణ్డ-మన్ననెన్నుంభాగవతరెల్లాలడిక్కొణ్డ- చిన్నసామిదాసర్ చిత్తమునైకుడిక్కొణ్డ శు॥

సమాధిలక్షణం.

వచనం॥ ధ్యానమేధ్యేయముగామారి ధ్యానస్వరూపములేక పోవుటే సమాధియనబడును. ధారణాధ్యానసమాధులు నొక్కచోట సమావేశమగుటకు సంయమమనిచెప్పబడును. ఇట్టి యోగమును చక్కగా నభ్యసించి సుఖించవలయును.

అయితే మనసు సహజంబుగానే చంచలస్వభావముగలది గా వున నిట్టి సమాధియోగంబు నభ్యసించుట దుర్లభంబని శంకింప,

శ్లో॥ రసస్యమనసశ్చైవ చంచలత్వంస్వభావతః।
రసబంధోమనోబంధః కిన్నసిధ్యతిభూతలే॥

అనగా పాదరసమునకును మనస్సునకును సహజంబుగానే చంచలత్వంబున్నది. లోకమందు రసము బంధింపబడుచుండగా మనసును నిరోధించుట దుర్లభంబుగాదు.

ద్రావిడవృత్తము.

మనదుసత్తునస్వరూపం మట్ట్రిరణ్డుం-వన్దుకలన్దన
అవక్లైత్రిమాట్ట్రినాల్ పోం-తనదుసన్మార్గత్తై
విడాదిరున్దపోదు- తామదముంరాజసముంశమిక్కుంప్పినై౽-
గనపరిణామంచలనంపోం పోనక్కాల్-కళంకం అట్టుగ్రినిన్ర
ఆకాయంపోలుం-నినదుళం అప్పడియాం
అబ్బిరమత్తొనాన్రియ్-నిరువికల్పసమాధియిలే నిట్కుంతానే॥

శ్లో॥ మూర్ఛితోహరతివ్యాధిం మృతోజీవయతిస్వయం।
బద్ధఃఖేచరతాంధత్తే బ్రహ్మత్వంరసచేతసి॥

అనగా రసము మూర్ఛనుపొందినదగుచు వ్యాధిని హరించుచున్నది తానుమృతమై అనగా పుటములచేత శుద్ధినిపొందినదై తనను భక్షించువారిని చిరకాలము జీవింపజేయుచున్నది బంధింపబడినదై ఆకాశగమనము జేయుచున్నది. గనుక రసమనెడి మనస్సు బ్రహ్మమందులీనమై జీవుని అమృతస్వరూపునిగా జేయుచున్నది.

గనుక తామసరాజసములను కడద్రోచి సత్వమందే నిలిచి ఆత్మారామధ్యానము నిశ్చలముగ జేసినయెడల మనసును నిరోధించుట దుర్లభంబుగాదు.

అట్లు మనసుయొక్క చంచలమును గెలిచినవారు,

పద్యము॥ అణుజంతువులయందు నణువై చరించుట-లణిమామహా యైశ్వర్యమలఘుచరిత। అబ్జజాండాది మహన్మహుడైయుంట - మహి

మాఖ్యభూతినిర్మలవిచార । బ్రహ్మాండమునకంటె భారమైయుండుట - గరిమాఖ్యసంపత్తికలుషదూర । అమరాద్రిసదృశుడై అతిసూక్ష్మగతి నుంట - లఘిమావిభూతిసల్లలితహృదయ ॥ వాంచితార్థావలంబనావాప్తిప్రాప్తి । గగనగమనాదిసిద్ధిప్రాకామ్యమర్క । శశిముఖనియామకత్వమీశత్వమఖిల। జీవవశ్యప్రవృత్తి వశిత్వమనఘ ॥ అనగా,

1. అణుప్రమాణములైన ప్రాణులకంటె యణుప్రమాణమై యుండుట - అణిమ.

2. విరాట్పురుష అండములకంటే పెద్దవాడగుట - మహిమ.

3. బ్రహ్మాండమునకంటే బరువైయుండుట - గరిమ.

4. మేరువంతటి బరువుగలిగియుండియు పత్తివలె తేలికయై యుండుట - లఘిమ.

5. ఇష్టపదార్థములను లభింపజేసికొనుట - ప్రాప్తి.

6. ఆకాశగమనము దూరశ్రవణము మొదలైన సిద్ధులు గలిగి యుండుట - ప్రాకామ్యము.

7. సూర్యచంద్రాది దేవతలను పనులయందు నియమించుట - ఈశత్వము.

8. సకలజంతువులను స్వాధీనముచేసికొనుట - వశిత్వము.

ఇవియే అణిమాది సిద్ధులను అష్టమహదైశ్వర్యములు. ఇట్లు పైజెప్పిన యమనియమాది అష్టాంగములుగల లయ హఠ యోగీశ్వరులకే తమతనువును అణురూపముగనైనను మహద్రూపముగనైనను చేసుకోగలిగిన శక్తియు దూరస్థములై ఇంద్రియములకు ప్రత్యక్షముగా గోచరముగాని సమస్తపదార్థములయొక్క స్వరూపస్వభావమును ఎఱుగదగిన దివ్యశక్తియును సాధ్యమగును.



మంగళం.

రాగం.- భైరవి - తాళం - రూపకం.

పల్లవి.

కణ్ణనుక్కు మంగళం- మణి-వణ్ణనుక్కు మంగళం॥ క॥

అనుపల్లవి.

విణ్ణవర్ కోనుం ముక్కణ్ణనుం అంద
వేదాన్తంతో ట్రమ్ పాదారవింద॥ క॥

చరణము.

తన్నై క్కళిప్పాడు దరిశిక్కవన్ద- ధరణి దేవర్ తఱ దరిద్దిరంచిన్ద- చిన్న సామిమనం తెళియ అనంత- శెల్వసమూహంగళ్ పల్ వగైయుం తన్ద॥ క॥ ఓం తత్ సత్..

రాజయోగము.

పద్యము॥ శ్రీగురుపదపద్మ సేవ జేసినగదా - కలుగును వైరాగ్య విలసనంబు । దేశికేంద్రునిపాదతీర్థమాడినగదా - పరతత్వబోధసంపద లభించు । సద్గురుదివ్యప్రసాదమబ్బినగదా - మానితోపరతిక్రమంబు దెలుసు । కారణగురుతత్వసార మెరిగినగదా - సంతతానందాతిశయము గలుగు ॥ గానసీరీతి గురుభక్తికౌశలముగ । సేయువారలె సుజ్ఞానసిద్ధులరయ । సకలనిగమాంతసంవేద్యసత్వభేద్య । శంకరార్యాత్మనిష్ఠేపస్వస్వరూపా॥.

ఇట్లు వైరాగ్య బోధ ఉపరతులచే జీవన్ముక్తి సుఖంబుపొంద గోరు సచ్ఛిష్యులు,

శ్లో॥ స్వవర్ణాశ్రమధర్మేణ తపసాగురుతోషణాత్ ।
సాధనంప్రభవేత్ పుంసాం వివేకాదిచతుష్టయం ॥

అనగా తమతమ బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర అను చతుర్విధ వర్ణంబులయొక్కయు బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాస అను చతుర్విధ ఆశ్రమంబులయొక్కయు ధర్మంబుగల తపస్సుచేత సద్గురుని సంతోషింపజేయుటవలన నిత్యానిత్యవస్తు వివేకంబు మొదలైన చతుర్విధ మోక్షసాధనంబు ఉదయించును. ఆవివర మెట్లనగా:-

శ్లో॥ నిత్యానిత్యవివేకశ్చ ఇహాముత్రవిరాగతా ।
శమాదిషట్కసంపత్తిః ముముక్షుస్తత్సమభ్యసేత్ ॥

భావం॥ సత్యంబగుబ్రహ్మంబుయొక్కయు అసత్యంబగుప్రపంచంబుయొక్కయు వివేకంబు, ఇహలోక పరలోక భోగంబులయందు వైరాగ్యంబు, శమము దమము ఉపరతి తితీక్ష సమాధానము శ్రద్ధల నెడి షడ్విధసంపద, ముముక్షుత్వంబు, అను సాధనచతుష్టయంబును మోక్షాపేక్షగలవారు,

ద్రావిడవృత్తము.

సాధనం ఇన్రి ఒన్రై చ్చాధిప్పార్ ఉలగిల్లై
ఆదలాల్ ఇన్దనాన్గుం అడైన్దవర్కఅివుణ్డాగుం
నూతనవివేకియుల్లిఽ నుణ్ణుయాదు నుణ్ణుయుమాగిల్
భూతజన్మంగళ్ కోటి పునిదనామ్పురుషనామే॥

అనియున్నందున, చక్కగా నభ్యసింపవలయును.

ఈ చతుర్విధమోక్షసాధనములలో తృతీయసాధనంబైన శమాదిషట్కసంపద వివరమెట్లనగా,

1. మనస్సు మొదలగు అంతరింద్రియంబుల శ్రవణాది. వ్యతిరిక్తంబులైన శబ్దాదివిషయంబులనుంచి త్రిప్పి శ్రవణాదులయందే నిలుపుట శమంబనబడును.

2. జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబుల శ్రవణాది వ్యతిరిక్తంబులైన శబ్దాది విషయంబులనుంచి త్రిప్పి శ్రవణాదులయందే నిలుపుట దమంబనబడును.

3. సన్యసించి విహితంబులగు కర్మాదులను శాస్త్రోక్తంబుగా విడుచుట, లేక, సన్యసింపని పక్షమందు కర్మాదులకు కర్తృత్వాద్యభిమానరహితులై కర్మఫలంబపేక్షింపక కర్మములను ఈశ్వరార్పణబుద్ధిచే జేయుట ఉపరతియనబడును.

4. ప్రారబ్ధ కర్మవశంబున సంభవించెడి సుఖదుఃఖాదులను సమంబుగ జూచుట తితీక్ష యనంబడును.

5. త్రిప్పిన మనస్సున్ను ఇంద్రియంబులున్ను వాసనావశంబున విషయంబులయందే పోవును గనుక వాటినిమళ్లించి శ్రవణాదులయందే నిలుపుట సమాధానంబనబడును.

6. సద్గురునియందును వేదాంతశాస్త్రంబులయందును ఈశ్వరునియందును గల విశ్వాసమే శ్రద్ధయనంబడును.

“ అథాతో బ్రహ్మజిజ్ఞాసా ” అను వ్యాససూత్రము ననుసరించి సాధన చతుష్టయ సంపత్త్యనంతరం బ్రహ్మవిచారణ జేయుటకు అధికారియని వేదాంత ప్రమాణము; గనుక ఈశ్వరానుగ్రహముచే ఇవి సులభముగా లభ్యమగుటకు సద్గురునిజేంది,



రాగం - మణిరంగు - తాళం - ఆది.

పల్లవి.

సదాచార్యచరణం - శరణం - శంకార్ణవతరణం॥ సదా॥

అనుపల్లవి.

ఉదారముకుంద పదారవింద - కథారసానంద సుధారసగంధ॥ సదా॥

చరణములు.

1. దివిభువియకరణం కవికులాభరణం - అవిద్దియావరణం కువియరవికిరణం॥ సదా॥

2. అగుణమెన వెఱుక్కుం సగుణమెనప్పొఱుక్కుం- తగుంతగా దెన్నిరుక్కుం మిగుమిరుళైయఱుక్కుం॥ సదా॥

3. తోన్దమిల్లనామి సంతతాభిరామి - అన్దముక్తికామి ఇంద చిన్నసామి॥ సదా॥

ఇట్లు భవసాగర తరణోపాయమగు సద్గురు పాదారవిందముల నాశ్రయించిన సచ్ఛిష్యుని చల్లని చూపులంజూచి,

ద్రావిడ విరుత్తము:

అన్నైతన్ శిశువై ఐయ్యన్ ఆనైయిన్ పళువైపోల
త్తన్నగం కరుదినోక్కి త్తడవి సన్నిధియిరుత్తి
ఉన్నదుపిఱవిమాట్ట్రిం ఉపాయమొన్నుణ్ణుశొల్వోన్
శొన్నదుకేట్పాయాగిల్ తొడర్ భవం తొలయుమెన్ఱార్.

అనునట్లు దృక్ దీక్ష వాక్ దీక్ష స్పర్శదీక్షలను త్రివిధదీక్షలచే అనుగ్రహించి జీవులు ఉద్భవించినది మొదలుగా అవిద్యచేత కమ్మికోబడి స్వస్వరూపమును మఱచి సుఖదుఃఖములను అనుభవించుచు బహుజన్మముల యందలి సుకృత విశేషముచేత బ్రహ్మవేత్తల దర్శనము కలిగినతోడనే నిత్య పవిత్రులగుదురు. గాన నెల్లవారును సద్గురుని జెంది అతని చతుర్విధ శుశ్రూషలచే సంతసింపజేయుచు బ్రహ్మజ్ఞాన సంపన్నులై ముక్తికాంతను చేపట్టి సుఖించవలయును. సచ్ఛిష్యులు సదాచార్యునికొనర్చు చతుర్విధ శుశ్రూషలు ఎవియనగా,

1. ఆచార్యాభిమతపదార్థంబుల నొడంగూర్చి సమర్పించుచు తమ తను ధన మనంబుల వారి యాధీనంబుజేసి ఒదిగి వర్తించుట ఆత్మ శుశ్రూష.

2. పాదసేవ అభ్యంగన మొదలుగాగల సేవలచే వారిని సుఖపఱచుట కాయశుశ్రూష.

3. క్షేత్రగృహాదులయందు వారలనునిచి సేవజేయుట స్థానశుశ్రూష.

4. తల్లి తండ్రి కర్త భర్త వారేయని త్రికరణశుద్ధిగా దలచిభక్తిచేవర్తించుట సద్భావశుశ్రూష. ఇట్లుచతుర్విధ శుశ్రూష జేయుచు,

శ్లో॥ త్వమేవమాతాచ పితాత్వమేవ త్వమేవబంధుశ్చ సఖాత్వమేవ।
త్వమేవవిద్యాద్రవిణంత్వమేవ త్వమేవసర్వం మమ దేవ దేవ॥

పద్యం॥ గురుడే తల్లియు తండ్రియు। గురుడే బాంధవుడుహితుడు గురుడే దైవం। గురుమూర్తికన్న నెక్కువ । పరిపూర్ణుఁడు లేడటంచు ప్రార్థనసేతుఁగా.

అని ఇట్టిసద్భావముచే ప్రాణావసానకాలపర్యంతంబైన లేక ద్వాదశాబ్దంబులైన సచ్ఛిష్యులు సద్గురుని నెడబాయక నుండవలయును.

అట్లు జేసినయెడల గురుఁడు సకలమాయా ప్రపంచజాల నటనలన్నియుగాల్చి పరతత్వజ్ఞానంబునుపదేశించును గాన మనోల్లాసము కలుగునటుల సద్గురుని సదా భజింపవలయును.



రాగం - సింధుభైరవి - తాళం - ఆది.

పల్లవి.

గురునిభజించుజీవా - ఓఅనాదిజీవా॥ గురు॥

అనుపల్లవి

గురునిభజించు జీవా - పరము నీకేమికొదువ॥ గురు॥

చరణములు.

1. బ్రహ్మాండబాండమున బాహ్యాత్రయమున వెలిగే- బ్రహ్మము నీవేజీవా ఓ అనాదిజీవా॥ గురు॥

2. పిండాండంబులుశోధించి కుండలిని భేదించి-కొండపైనుండుజీవా ఓఅనాదిజీవా॥ గురు॥

3. చూచేటి చూపునీవె చూపులోగానునీవె-సూక్ష్మమునీవెజీవా ఓ అనాదిజీవా॥ గురు॥

4. సత్యజ్ఞానానందమున నిశ్చలాత్మవైయుండెడి - నిత్యమునీవెజీవా ఓ అనాదిజీవా॥ గురు॥

5. కామముఁబఁఁచిబట్టి కన్నులుచెదరకనిలిపి - నిష్కామివై యుండుజీవా ఓ అనాదిజీవా॥ గురు॥

6. ఒచ్చేపోయ్యేదోవ దెలిసి దోవకు పైగానునిలిచి-నిటలమందుండుజీవా ఓ అనాదిజీవా॥ గురు॥

7. పుట్టలోజుట్టుకొన్న బుస్సనేపాము దెలసి-గట్టిగానటిఁ కుజీవా ఓ అనాదిజీవా॥ గురు॥

8. ఆరిటరిపులగెలచి ఆమికలణచి శుద్ధ-జ్ఞానివైయుండుజీవా ఓ అనాదిజీవా॥ గురు॥

9. తరికొండనరహరి శేషగిరిపతి సుబ్రహ్మణ్యం-గురుడనిజూడు జీవా ఓ అనాదిజీవా॥ గురు॥

ఇట్లు నిశ్చలగురుభక్తిగల సచ్ఛిష్యులను సదా ఆనందభరితులైయుండు సద్గురుండు కరుణతో వీక్షించిచండాళవాకిట బ్రాహ్మణునికి ప్రవేశ యోగ్యముకానట్లు జ్ఞానరత్నమును అపహరింప సమయమును వీక్షించి పొంచియుండు కామాది అరిషడ్వర్గమను చండాళులు సమీపమునుండు పర్యంతము చేతనుని హృదయము స్వస్వరూప విచారణమునకు యోగ్యముకాదు; గాన అహంకార మమకారాదులను దూరముగ జేయవలయు. మరియు,

శ్రుతి॥ జాతంమృతం ఇదం దేహం మాతాపితృ మలాత్మకం ।
సుఖదుఃఖాలయామేధ్యం స్పృష్ట్వాస్నానం విధీయతే॥

2. ధాతుబద్ధంమహారోగం పాపమందిరం అధృవం ।
వికారాకారవిస్తీర్ణం స్పృష్ట్వాస్నానం విధీయతే॥

3. నవద్వారమలస్రావం సదాకాలేస్వభావజం ।
దుర్గంధందుర్మలోపేతం స్పృష్ట్వాస్నానంవిధీయతే ॥

అనునట్లు హేయమైన ఈదేహమే తాననెడి నిశ్చయమును పుట్టించి విషయసుఖములను గడ్డిమేయుచు విఱ్ఱవీగులాగునజేయు మహామోహమును పోగొట్టుకొనుటకును అన్నవస్త్రాది భోగేచ్ఛచే గలుగు విశ్వాస ఘాతకాది ధుర్గుణములు వదలుటకును భగవదనుగ్రహమును యేవిధముననైనను పొంది సుఖించవలయునని సద్గురుండు బోధింప శిష్యుండు,

ద్రావిడకీర్తన - రాగం - సురటి - తాళం - రూపకం.

పల్లవి.

ఎన్నత్తుక్కిందకోపం- ఇదిలునకెన్నలాభం॥ ఎ॥

అనుపల్లవి.

అన్నత్తుక్కుం వస్తిరాదిగట్కుంతిరి-న్దలైవదుం మనంకలైవదుం తెరి న్దెన్నత్తుక్కిన్దకోపం॥ ఎ॥

చరణములు.

1. వాలియై మత్తైన్దిరున్దంజెయ్దు- వద్దైత్తవనెన్రేనా- వన్దఖరనై క్కండోరుకాలైప్పిన్ వైత్తవనెన్రేనా - శూలిముదలోరైయుం తురత్తి యుమ్బాణా- సురనై వెన్రవనెన్రేనా వీణా॥ యెన్న॥

2. ఉలగైప్పడైత్తళిత్తళిక్కుం వెళి-యూరనెన్రేనా-ఉట్ట్రిరుం పెట్ట్రిరుం ఇల్లాదవన్- ఒండిక్కారనెన్రేనా-అలఘిలండంగళిలుం అభిన్నమాయుం అలక్ష్యనెన్రేనో వీణాయిన్నం॥ ఎన్నత్తు॥

3. జగత్తిల్ పొదువాగియరక్కర్ వేరైక్కొయ్దవనెన్రేనా- దేవర్కుముదం తన్దసురరై మోసం శెయ్దవనెన్రేనా- అగత్తిల్ కుడియిరామల్ పోనాలుం-అణ్ణాత్తపోధుం వారామలానాలుం॥ ఎన్నత్తు॥

4. తాటకైకారికై యెన్రఱిన్దుమ్ శంగరిత్తవనెన్రేనా- జారచోరశిఖామణియెన్రుపేర్ ధరిత్తవనెన్రేనా- నాటకమాడుం జగన్నారితనక్కుం- నట్టువనెన్రేనో నాథనేయునక్కుం॥ ఎన్నత్తు॥

5. మామర్ మిాదంబై విడుత్తవన్ వానరప్పడైయనెన్రేనా- మామనైక్కొన్రవన్ మాడాడుమేయ్త్తవన్ ఇడయనెన్రేనా - క్షేమమిగుంపరంధామనేపోదుం-చిన్నసామిదాసనెన్బవన్ మిాదుం॥ ఎన్నత్తు॥

ఇట్లు భగవంతుని శరణుజొచ్చిన శిష్యులకు గురుండు

శృతి॥ కర్తృత్వాద్యహంకార సంకల్పోబంధః॥ అనగా,

అహంకర్త అహంభోక్త అహంసుఖి అహందుఃఖి అను దేహము తానను భావముచేతయు,

శృతి॥ అనిత్యసంసారవిషయ బద్ధోదుఃఖః ॥ అనగా,

నాభార్య నాబిడ్డలు నాధనము అను అభిమానముచేతను గలుగుబంధము వీడకున్న పునః పునః భగవధ్యానమ్ఁజేయవలయునని బోధింప శిష్యుండు మరల,



రాగం - సౌరాష్ట్రం - తాళం - ఆది.

పల్లవి.

ఇదువాళోల్లువేఁ ఇన్నుం ఎత్తనైయోళోల్లువేఁ-
ఎనదుమనదునొన్దాల్॥ ఇదు॥

అనుపల్లవి.

పొదువానదైవమెన్ను పోట్రియరంజనైయిల్ -
పుగళ్ పృగళ్సీపురిగిన్నవంజనైయిల్॥ ఇదు॥

చరణములు.

1. తాయ్మొళియినై ప్పరిపాలనంశెయ్యలన్ను - తన్దైమైత్తళరవిట్టు వనవాసియానవన్-వాయ్మాత్తిరం వాళ్కనికైక్కఅణ్ణామెన్నవనైఅటిన్దువిడామల్ మతిమోసంపోనవఁ॥ ఇదు॥

2. అగ్గినియైచ్చుడు మెంగళనైళెగ్గరుబ్బత్తుడఁ - అరణియంతన్నిల్ విట్టువరుంబడి ప్పరిన్దవఁ - ముక్కియకరుణై క్కడలెన్నుఱుదియాగనమ్బి - మోసంపోనదిలులగం ఏళ వయితెరిన్దవఁ॥ ఇదు॥

3. హుంకారంశెయ్దడుమైగంగాధరనైబ్బయన్దోడచ్చెయ్దవన్ అన్బర్కుదవువానెన్నుళోల్లుం - శృంగారపేచ్చిండేశెల్లుమో శెల్లాదెన్నుచిన్నసామిదాసఁ ప్రసిద్ధమాయిప్పోదుళోల్లుం॥ ఇదు॥

అనిస్తుతింప మరలగురుఁడు,

పద్యము॥ బాంధవమునసైనపగనైన వగనైన। ప్రీతినైన ప్రాణభీతినైన।భక్తినైనహరికి పరతంత్రులైయుండు।జనులు మోక్షమునకు జనుదురధిప॥

ఇట్లు ఏవిధముననైన శ్రీహరికిపరతంత్రులై అతనినే సర్వదాస్మరించుచుప్రవర్తించువారు తప్పక బ్రహ్మజ్ఞానములభించి మోక్షమును పొందుదురుగాన ఎల్లపాపములనుహరించునట్టి శ్రీహరి సాకార నిరాకారమహిమలను కొనియాడుచునుండవలయునని ఆనతిచ్చినవినిశిష్యుండు,

శ్లో॥ త్రాహిమాంకృపయా దేవ శరణాగతవత్సల।

అనునట్లు తననేరములను క్షమించిరక్షించుటకై, భగవంతుని



ద్రావిడకీర్తన. రాగం-దర్బార్-తాళం-ఆది.

పల్లవి.

నిన్నిత్తేనెన్రువిళ్ళాదే - నెంజత్తిల్ కోపంకొళ్ళాదే॥

అనుపల్లవి.

వన్నిత్తువన్నిత్తు చ్చిన్నిత్తుచ్చిన్నిత్తు - సంధిత్తిడాబ్బున్ని మన్నిత్తుమన్నిత్తు॥ నిన్ని॥

చరణములు.

1. ఎన్ననైబ్బాదిక్కుం బంధంతనక్కంజి - ఇన్దవనైశొన్న దున్నైయుంబిుంజి॥ నిన్నిత్తే॥

2. కైతన్దరుళ్ మారి పెయ్దరుళుంఎమ్మానే - వైదాలుంతోత్తిరం శెయ్దాలుం ఉన్నై ఎత్తానే॥ నిన్ని॥

3. కున్నమాగనెఱుక్కుం కిన్నంగళైమాట్ట్రి - చిన్నసామియెన్నుం ఎన్నై ఎయుంకాపాట్ట్రి॥ నిన్ని॥ అనిప్రార్థింపగురుండు మరల,

శ్రుతి॥ అసత్యసంసారవిషయజనక సంసర్గయేవనరకః॥

అనగా విషయములయందు మనస్సును స్వేచ్ఛగాప్రవేశించునట్లు ప్రేరేపించు జీవాహంకార ఈషణత్రయాభిమాన అశుద్ధవ్యాపారమే నరకముగనుక వీటినివదలి,

శ్లో॥ సత్యంమాతాపితాజ్ఞానం ధర్మోభ్రాతాదయాసఖా।
శాంతిఃపత్నీక్షమాపుత్రాః షడైతే మమబాంధవాః॥

అనునట్లు ఇట్టి బంధువుల నిరంతరసహవాసముచే బ్రహ్మనిష్ఠు లలో శ్రేష్ఠుడగుసద్గురునిపొంది వారిముఖమనెడు చంద్రబింబమునుండి దిగజారుచుండు మోక్షరూపమైన అమృతమును సదా పానముజేయు వారికి జరామరణములుఁగల స్థూలశరీరము నేననెడుభ్రమ నశిం చును సూక్ష్మశరీరధర్మమైన ఆకలియు దప్పియు దూరమగును కారణ శరీరధర్మమైన శోకమోహములువీడును అనగా త్రిశరీరములు నేననెడు అభిమానమువదలి,

శ్లో॥ “ఉపాధిత్రితీయాధన్యం ఆత్మానం అవధారయేత్”

అనునట్లు పరబ్రహ్మము నేనను తెలివిప్రభలుటచేత అంతఃకర ణము నిర్మలమై సంతోషింతురు గనుకనే,

శ్రుతి॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే।
తద్బ్రహ్మాహంఇతిజ్ఞాత్వా సర్వబంధైప్రముచ్యతే ॥

అనగా ఏసత్యజ్ఞానానందాది లక్షణబ్రహ్మంబు బుద్ధ్యాదులకు సాక్షిత్వముగావర్తింపుచు జాగ్రదాదిప్రపంచమును ప్రకాశింపజేయునో ఆబ్రహ్మంబే నేననియు బుద్ధిచిదాభాసాదులు నేనుగాననియు నెరింగిన వారు సర్వబంధములచేత విడువబడుచున్నారు అని బోధింపుచున్నది గాన ముముక్షువులు,

శ్లో॥ రజ్జుసర్పవదాత్మానం జీవోజ్ఞాత్వాభయంవహేత్।
నాహంజీవఃపరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయోభవేత్॥

అనగా రజ్జువును త్రాడని తెలుసుకొనునట్టి తెలివిలేమిచే ఆరజ్జు సర్పరూపంబైతోచి దేహకంపనాదులుమొదలైన భయము కలుగు చున్నది అది సర్పముకాదు త్రాడేయని ఆప్తునిచే తెలియవచ్చుచుం డగా సర్పభయమువదలుచున్నది ఆలాగే సద్గురుబోధవలన అనృత జడ దుఃఖ మలిన ఖండరూపమైన దేహాదులను అభిమానించు జీవస్వరూ పులముకాము సత్తు చిత్తు ఆనంద నిర్మల అఖండపరబ్రహ్మస్వరూపులమని ఎరుంగుటవలన జననమరణాదిభయమువదలి నిరతిశయానందులై,



ద్రావిడకీర్తన. రాగం- పున్నాగవరాళి- తాళం - ఆది.

పల్లవి.

నమ్మైయారెన్న శెయ్యలాం - ఓమనదే॥ నమ్మై॥

అనుపల్లవి.

ఇమ్మైమఱుమైయిలుళ్ళోర్ తమ్మైబోమ్మైగళెన్ణి -
అమ్మైజానకినాథనై చ్చెమ్మైయాయ్ నంబియిరుక్క॥ నమ్మై॥

చరణములు.

1. కామనైయొత్తుం ఉదైత్తేమనై వెన్రవన్ ఓదుం - సోమనై ప్పరంధామనై రామనైనంబియిరుక్క॥ నమ్మై॥

2. వాణియ్యనీశన్ సరువాణి వాసవనుంఇంది - రాణియుం తోత్రం కోదండపాణియై నంబియిరుక్క॥ నమ్మై॥

3. భావనై శెయ్దానందిక్కుం జీవనైయాళుంమహాను - భావనై దేవర్కుం ఆదిదేవనైనంబియిరుక్క॥ నమ్మై॥

4. ఆరణంగళుంకాణాద కారణకారణనాగి - పూరణపూరణ నావ నారణనైక్కూడివాత్రం॥ నమ్మై॥

5. ఎళ్ళుక్కుళ్ళెణ్ణైయెప్పోల్ ఉళ్ళుక్కుళ్ళాయిరుక్కుం - తెళ్ళుం మణియైయఱిందు తుళ్ళుం ఉళ్ళంసుఖంకొళ్ళుం॥ నమ్మై॥

6. నల్లారుంపొల్లారుం ఇల్లారుంఉళ్ళారుం - ఎల్లాం అవన్మయ మెన్రుల్లాసమాయిరుక్కుం॥ నమ్మై॥

7. యాజ్ఞ్యవల్క్యగురు వాక్కియత్తైమఱవాద - యోగ్గియ నైత్తెయాళిన్ద భాగ్గియమడైన్దిరుక్కుం॥ నమ్మై॥

8. పన్నగపతిశయనన్ పొన్నడిక్కడుమైయాన - చిన్నసామి. దాసన్మతం ఇన్నదెన్నఱిన్దిరుక్కుం॥ నమ్మై॥

అనియిట్లు సుఖింతురు. ఓం తత్ సత్॥

శ్లో॥ నిత్యనిర్మలభావాయ నిరావరణరూపిణే।
శంకరాచార్యదేవాయ తస్మై జ్ఞానాత్మనేనమః ॥ అనిస్తుతించి,
ముందుజెప్పిన మంత్ర లయ హఠ రాజయోగముల మర్మ
ములను విస్తరించిబోధింపుడనిప్రార్థింప సద్గురుండు,

శ్లో॥ ఏకాక్షరం ద్వ్యక్షరంవా షడక్షరంఅథాపివా !
అష్టాక్షరంవామంత్రాయ మంత్రయోగీ సదాజపేత్ ॥

శ్రుతి ॥ ఓం ఇతిబ్రహ్మ-ఓం ఇత్యేతదక్షరం ఇదంసర్వం- ఓం ఇత్యేకాక్ష
రం బ్రహ్మ- అనుప్రణవమే బ్రహ్మము.

2. ద్వయక్షరమనగాఅజపమంత్రము. జపముజేయకనే నిత్యము
ఇరువదియొకవేల నారూర్లరుల జపమగుచుండునది.

శ్లో॥ సకారోధ్యాయ తేజంతు హ్యాకారోహిభవేధ్రువం ।
అనఁగా సకారరూపుఁడైనజీవుఁడు హాకారరూపుఁడైన పరమా
త్మతో అయిక్యమగునట్లుధ్యానించిన హాకారబ్రహ్మమేయగును.

3. ప్రణవముతోగూడినశివపంచాక్షరి షడక్షరియనంబడును.

ద్రావిడవృత్తము.

1. అంజెళ్ళుత్తినిలొరువుడై పతియెనఅమరుం
వంజముట్టుశివొరువుడై పాశమాయ్వదియుం
తుంజలిన్రియఇడైయినిల్ పశువెనత్తులఙ్గుం
అంజెళ్ళుత్తినిల్ ముమ్మద లటెన్దవర్ పిఱవార్ ॥

2. పాశమాగియఇరణ్డైయుం పడిఅెనత్తళ్లి
నేశమాగియఇరణ్డై నెంజిడైయళ్ళుత్తి
కాశనీజ్గియకణ్ణైన ముత్తియైకాణ్బాయ్
ఆశైనీజ్గియనిలైయిదు ఇదట్కిలైఐయ్యం ॥

4. ప్రణవయుక్తంబైన నారాయణమంత్రంబు అష్టాక్షరి యనం
బడును.

శ్రుతి॥ యస్యకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా।
అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః॥

ఎట్టి పరబ్రహ్మంబునుగూర్చి విధి శివ సనకసనందన నారదవ్యాస వాల్మీకపరాశరాదులు ఇట్టిదట్టిదని నిర్ణయింపలేక గుణయుక్తుండో గుణ రహితుండోయనుచుచింతింతురో అట్టి సకలభూత అంతర్బహిర్వ్యాపకుండగు గుణసహిత గుణరహిత నారాయణశబ్దవాచ్యుండైన పరంజ్యోతిరూపంబు సహస్రదళపద్మంబునందు ఈదివ్యమంత్రబలముచే దర్శనీయంబగును.

శ్లో॥ మంత్రాణాంపరమోమంత్రో గుహ్యానాంగుహ్యముత్తమం।
పవిత్రంచపవిత్రాణాం మూలమంత్రస్సనాతనః॥

సప్తకోటిమంత్రములలో,

1. గాణాపత్యేషుశైవేషు శాక్తసౌరేష్వభీష్టదః। వైష్ణవేష్వపి సర్వేషు రామమంత్రఃఫలాధికః॥

2. గాణాపత్యాదిమంత్రేషు కోటికోటి గుణాధికః। మంత్రస్తేష్వప్యనాయాస ఫలదోయంషడక్షరః॥

3. షడక్షరోయంమంత్రస్స్యా త్సర్వాఘౌఘనివారణః। మంత్రరాజఇతిప్రోక్త స్సర్వేషాం ఉత్తమోత్తమః॥

గనుక తారకమంత్రమే మంత్రరాజము.

శ్లో॥ రమంతే యోగినోనంతే సత్యానందేచిదాత్మని। ఇతిరామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే॥

అనగా నేను బ్రాహ్మణుడను, క్షత్రియుడను, వైశ్యుడను, శూద్రుడను, బ్రహ్మచారిని, గృహస్థుడను, వానప్రస్థుడను, సన్యాసిని, సుఖిని, దుఃఖిని, పాపిని, పుణ్యుడను, బద్ధుడను, ముక్తుడను, జననమరణములుగలవాడను, దేహేంద్రియ ప్రాణాదులతోగూడిన జీవుడను, శివ రామ గోవింద నారాయణ నామములు గలవాడను అనెడి భ్రాంతి జ్ఞానమును పుట్టించునది అజ్ఞానము. ఇట్టి అజ్ఞానమును నశింపజేయు

నది నేను సచ్చిదానందనిత్య నిర్మల పరబ్రహ్మస్వరూపుడను అని సద్గురుని సన్నిధిని శ్రవణమనన నిధిధ్యాసములవలన దెలిసి ఆ జ్ఞప్తిని తప్పకుండు యోగీంద్రుల హృదయములయందు రమించునతడెవడో అట్టి యోగీంద్రులహృదయములు యెవనియందు రమించుచు ప్రకాశింపుచున్నవో ఆ పరబ్రహ్మమే రాముడుగనుక తారకమంత్రంబే ఉత్తమోత్తమంబు అని బోధించి గురుండు పిదప,



రాగం - హుసేని - తాళం - రూపకం.

పల్లవి.

యాలతెలియరాదెమర్మము-ఓమనసనీకు॥ యాల॥

అనుపల్లవి.

యాలతెలియరాదెనీకు బాలనేనుజెప్పినట్టి -
మూలమెరిగిగుర్తెరుగనడుమ - మేలుదెలియమంటెనీకు ॥ యాల॥

చరణములు.

1. జంటరేకులంటమంటినే-మదిగట్టిజేసి-జుంటితేనెగోళ్లమంటినే। కంటిపాపవెంటనంటి మంటిమింటిరెంటినడుమ - ఇంటిలోనవెలుగువాల్గంటి తెలియమంటెనీకు॥ యాల॥

2. కొండలేడుద్రొక్కమంటినే - ఆపైనమూడు- మండలములుజూడమంటినే । అండపిండమనెటి బ్రహ్మాండమందువెలుగుచుం - డఖండజ్యోతిఅండనిలిచి యుండమంటెనీకుయిపుడు ॥ యాల॥

3. మూడునదులుగడువమంటినే-ఆతలుపుదీశి-మూలయిల్లుచొరమంటినే । కాటుపడకమేడమీద వేడుకలరచేడతోను - జోడుగూడి అరసియందు వాలలాడమంటెనీకు ॥ యాల॥

4. ఆరుమెట్లుదాటమంటినే-కదసిమూ-డారుమూసి యుండమంటినే। చేరికతోపదారునాలుగారుదాటిఆవలజేరి - యాలయీా విచారమనుచు ఎంతజెప్పినానువినవు ॥ యాల॥

5. చక్కనిక్కి జూడమంటినే - నీముక్కు దిక్కు - ఎక్కుబెట్టిజూడ మంటినే। సొక్కి సొక్కి మక్కువలర యెక్కువైనపదవిజేరి - దిక్కు వేంగ గురుడెయనుచు మ్రొక్కియుండమంటెనీకు ॥ యాల ॥

ఇట్లు రేచక పూరక కుంభక మార్గములచేత,

పద్యము ॥ పరమహంసనుబట్టి బ్రహ్మరంధ్రములోన। ఊర్ధ్వ ముఖముఁజేసి యునిచిజూడ। కోటిదోషములన్ని కూలిసున్నంబగును సంశయంబులులేకచాటుమనసా ॥

అనునట్లు శ్వాసమును బ్రహ్మరంధ్రమునకెక్కించి దశవిధప్రణవ నాదములువినిచొక్కుచు చిదాకాశమనుబయల సహస్రార కమలమను సౌధములోపల గంగాయమునసంగమమగు రంగస్థలమున దివ్యజ్యోతి దర్శనముఁజేశిసుఖించువారికి నిస్సందేహముఁగ సకలదోషంబులుసున్నంబై బ్రహ్మానందములభించును.

ధ్రావిడకీర్తన - రాగం - కేదారగౌళం - తాళం - రూపకం.

పల్లవి.

రంగా మోహనాంగా-ఎన్నై రక్షిక్కాదునక్కు-ప్పాంగా ॥

అనుపల్లవి.

గంగానమక్కొళ్ళడంకావేరి - క్రైయిల్ వాశ్రమ్-
ఎన్దురైయేకస్తూరి॥ రంగా॥

చరణము.

ఇజ్ఞాగిలుంఅజ్ఞాగిలుం ఎజ్ఞాగిలుంతజ్ఞామలుం - పొజ్ఞామలుం మ జ్ఞామలుంశజ్ఞామలుం కాపంకజభవశంకరసురపుంగవనుత మంగళగుణ పన్నగపతిశయనసాంద చిన్నసామిదాసనంద॥ రంగా॥

ఇట్లు త్రికూటమనెడిస్థలమందలి సూర్యసోమ అగ్నిమండలముల నడుమ సప్తజ్ఞానభూములలో కడపటిదైన తుర్యమనెడి యొంటిస్తంభపుమేడయందు శ్రీరంగనాథుని దివ్యజ్యోతిదర్శనముచే సంకల్పవికల్ప

ములు మానావమానములు మొదలగువానిఁగడచి సుజ్ఞానమను దివ్య నేత్రమువలన మాయాశక్తినిఁగనుఁగొని విశ్రాంతినొంది ఎఱుకలోఁ గలిసి నివాతదీపచందముననిశ్చలతనొంది సచ్చిదానందపరిపూర్ణస్వరూపమునుఁగానకఁగని సర్వమునుమఱచి తన్మయమై చిన్మయమై అద్వితీయమై అవాఙ్మానసగోచరమైనబ్రహ్మానందమను సుధారసమును పానముఁజేయుచు పరవశతనొంది సుఖించేవారి భాగ్యమేభాగ్యమని,గురుండు మఱల,

పద్యము॥ రాజయోగంబుము క్తికిరాజపథము। రాజగుహ్యంబు పరమంబురాజవిద్య। అదియుమూడువిధంబులనలరుచుండు। సాంఖ్య తారకసదమనస్కములనంగ॥

యోగములకెల్ల రాజుగానుండుటచే రాజయోగమనఁబడియె. ఇది త్రివిధంబులు.

పద్యము॥ తారకంబుమనశ్శుద్ధికారకంబు। సాంఖ్యమాత్మస్వరూపవిచారకంబు। అనుభవజ్ఞానమమనస్కమట్లుగాన। నాద్యమెరిగింతు మొదలనీవవధరింపు॥

తారకంబనగా అక్షిపురుషయోగము.



రాగం - సింధుభైరవి - తాళం - ఆది.

1. ఫలితంబుగ భూ్రిమధ్యమునందున- భానుజ్యోతియేమోయి
శివ-విలసితముగపిండాండచక్షులీ-వివరము తెలియవెగారి॥

2. మలహారభూ్రిమధ్యమునవెలగే- మహిమజ్యోతియేమోయి
శివ-విలసితముగబ్రహ్మాండచక్షులీ-వివరము తెలియవెగారి॥

3. తడయకచక్షులుమూసితెవెలిగే-తఱుచుజ్యోతి యేమోయి
శివ-ముడిగొనుషడ్రహితంబైనట్టి మూలంబిదియెగారి॥

4. హృదయకమలమునగురులింగంబై-యుద్భవించు టేమోయి
శివ-పదిలంబుగగురునమ్మినసమ్మిక ఫలముసిద్ధమేగారి॥

5. విశ్వరూపమై వెలుగుచునుండెడి - శాశ్వతరూప మే మోయి
శివ-పశ్చాత్తాపములుడిగినయపుడే భావాతీత మేనాతి॥

6. పంచముఖంబున ఊర్ధ్వముఖంబై - పని(గన్పించు టే మోయి
శివ-నిశ్చయమనుచునె నమ్మినవారికి నిజచిన్మయ మేమగువ॥

7. చూటిగపవనమునందుజూచితే - స్వప్రకాశ మే మోయిశివ-
పుట్టిపుట్టనిల్లాలిని గెలిచిన షాలతివిశేష మేకొమ్మ॥

8. నీలమేఘపుఛాయలలోపల - నిండుమెరుపులే మోయిశివ -
కాలాకాలుని గెలిచినమయమున కదసిన మే లేభామ॥

9. కోటిమన్మథులమీరినరూపము- కోరినమహిమే మోయిశివ-
నాటకశ్రీగురునమ్మిననమ్మిక నటనమహిమ యిదినాతి॥

10. ఏడుకొండలాదొంతిగ వెలిగెటి - వేడుకచూపే మోయిశివ-
ఏడువ్యసనములు వెనుకొనిగెలిచిన వేదాతీత మేభామ॥

11. వేయిరేకులకమలముమీదొక - వింతచూపులే మోయిశివ-
గౌరీశుండనిజపాన్పడి నీమదికనుగొనిచూడ వేగారి॥

12. కిలితఘుమఘుమఘుమమని మ్రోసే - మేలునాద మే మోయి
శివ-వ్రతలుడుడిచినొక వ్రతముననుండె మేలునాద మేభామ॥

13. కీలాస్వరమునమత్తగజమునొక - మేలునాద మే మోయిశివ-
నీలవినోదుని ప్రభువునినణచిన నిజస్వరనాద మెగారి॥

14. ఆరువర్ణముల అందులవెలిగెటి - అధికంబది యే మోయిశివ-
ఆరుచక్రముల అందులవెలిగెటి అల్లమప్రభు వేమగువ॥

15. అనిగొరడిగిన అనుభవమహిమలు ఆనతిచ్చెనుశివుడు-విని
భవానిశంకరులీరీతిని వేడుకతోకూడుండ్రి॥

ఇట్టి భవానిఅనుభవ తారక యోగమహిమలను గ్రహించి సుఖింపవలయును.

శ్లో॥ మూలాధారంగుదస్థానం స్వాధిష్ఠానంతు మేహనం।
నాభిస్తుమణిపూరాఖ్యం హృదయాబ్జం అనాహతం।
తాలుమూలంవిశుద్ధాఖ్యం ఆజ్ఞాఖ్యంనిటలాంబుజం।
సహస్రారంబ్రహ్మరంధ్రం ఇత్యాగమవిదోవిదుః॥

వీటినే మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయ సహస్రారకమలంబులని బ్రహ్మవిదులుఁజెప్పుదురు.

పద్యము॥ రక్తశ్వేతముకృష్ణనీలము మహారమ్యంబుగాపీతముల్ । యుక్తంబన్నియు నొక్కటౌచుఁగలయన్ పపారగాతీతమై । వ్యక్తంబై పరమైవెలుంగునవల్లం వీరూపముల్ల్యాకయుల్ । శక్తిస్సహితముగా గనుండు గురునిన్ సేవింతునైక్యార్థమై ॥ అనునట్లు,

పైజెప్పిన ఆధారాదిచక్రములలో మెలగుచుండు వర్ణములయందు వెలుగుచు అతీతముగనుండు ఆత్మసందర్శనముచేత, తనువ్యసన, మనో వ్యసన, ధనవ్యసన, రాజ్యవ్యసన, ఐశ్వర్యవ్యసన, ఉత్సాహవ్యసన, సేవకవ్యసనంబులను దుఃఖసాగరంబును,

శృతి॥ తరతిశోకం ఆత్మవిత్ ॥

అనునట్లు తరింతురు. గాన ఆత్మజ్ఞానముకొరకు సదాసద్గురుని అనన్యభక్తితో భజింపవలయునని బోధింప, శిష్యుండు

శ్లో॥ అన్యథాశరణంనాస్తి త్వమేవశరణంమమ ।
తస్మాత్ కారుణ్యభావేన రక్షరక్ష జనార్ధన ॥

రాగం - యదుకులకాంభోది - తాళం - చాపు.

1. ఇన్నం ఇరుళో ప్రియాదిరుప్పదేన్ హరిప్రాసనెన్నవా రఘు మన్నవా - అన్నవస్త్రంగట్కాణువనిఱెంగుల తిరిన్దల్లాడవా పున్నెప్పాడవా॥ ఇ॥

2. అన్నైతన్దనీయల్లామలిల్లైయెన్బదుం పొయ్యాచ్చుదో పక్షం పోచ్చుదో - ఎన్నైయిన్దసంకటత్తిలిరుత్తలాగుమో - జగదీశనే హృషీకేశనే ॥ ఇన్నం॥

3. ఉన్నైయల్లాలొన్రుమిల్లైయెన్రువేదంగళుక్కైం-ఓదవా తానోమాధవా - మున్నై యోదుంమొప్రిమాటి - మోసంశెయ్యలా మోదయామూర్తియే నల్లకీర్తియే ॥ ఇన్నం॥

4. ఇవనుక్కు నిన్నైత్తదుదవ నమ్మైత్తుదియానెన్రెణ్ణమో - ఇదు తిణ్ణమో - శివనుక్కుం కంజభవాదిగళుక్కుం తరలామో శ్రీధరా దామోదరా ॥ ఇన్నం॥

5. ఓరవంజగం పురిన్దాలున్నై నాథనెన్రులగం ఒప్పుమో - పున్రైతప్పుమో - ఈరనెంజిల్లాదునక్కు కరుణానిధియెనుంపేరేదైయా వన్దోదయా ॥ ఇన్నం॥

6. పారంవారం ఉన్నైరఘువీరనెన్రులగం ఓదుం వాడిక్కై - వెగు వేడిక్కై - ధీరనానాలెనదమిత్తిరరై జైయిత్తిడాయో చిన్మయా నందతన్మయా.॥ ఇన్నం॥

7. ఆగమిల్లా దన్బరగ నోగవైవారెన్రు భయమాగవా - వీర రాఘవా - దేగమిల్లైయాగిలిన్ద శేవైయిల్లైయెన్రుతానో శ్రీపతి సకల భూపతి ॥ ఇన్నం॥

8. ఎజ్ఞుం నల్లమేన్నైత్తన్దుం ఇప్పడియేన్ ఉరైశెయ్దాయె న్నైబయే - పారాయన్నైబయే - ఇంగునిఖిలరుంపడియేఱక్కడైత్తేఱత్తొర్ర దేట్ట్రినేఽ ఇవైశాట్ట్రినేఽ ॥ ఇన్నం॥

9. పేశాదునదుపదం పెట్రుం ఇన్నం పిఱన్దెజ్ఞుంపేశసా - ఆది కేశవా - కూశాదకలవియిల్ కుఴన్దై యత్తాదాలిన్బం కొళ్లుమో సుఖం తుళ్లుమో ॥ ఇన్నం॥

10. పొయ్యెన్రగట్ట్రియదై మెయ్యెన్రునమ్బి శెయ్యప్పోగుమో - సరి యాగుమో - నెయ్యైచ్చొరిన్దిట్టాలుం వమనోదనత్తై యుణ్ణనేరుమో శుద్ధంశేరుమో ॥ ఇన్నం॥

11. అల్లుంపగలుం ఉన్నై యడుక్కి లిదయచ్చుఖం అల్లవా ఇన్నం శొల్లవా - నెల్లుక్కు ప్పాదుపట్టాల్ వైక్కల్ తానే వారాదో నిత్యనే నిత్యశుద్ధనే ॥ ఇన్నం॥

12. శొన్నసూక్ష్మమఱిన్దు సుఖంతన్దరుళ్ వమన్దఽ సొందమే - పరమానందమే - చిన్నసామిక్కు వేఱు దిక్కిల్లైయెన్రు ననారింయ్ త్తెరియుమే కృపై పురియుమే ॥ ఇన్నం॥

ఇట్టి ఆర్తిఁజెంది అనన్యభక్తిచే ప్రకాశించువారు, ముందుఁ జెప్పిన తారక సాంఖ్య అమనస్క యోగములలో ప్రథమమందు తారకయోగము నభ్యసింపవలయును. ఎట్లనగా,

పద్యము॥ కనులు రెండుగురుని యనుమతిగోనిమూసి । బొమల నడిమి ద్విదళకమలమునను । విమలదృష్టినిలిపి శమలలితాత్ముఁడై । చూడవలయు లక్ష్యశోభనముల ॥ ఇట్లుజేయుచు,

శ్లో॥ శ్రీరామరామరామేతి రమరామేమనోరమే ।
సహస్రనామతత్తుల్యం రామనామవరాననే ॥

పద్యము॥ శ్రీమనోరామ శ్రీరామరామరామ। యనుచు రమి యింతురామునియందు రామ। నామమువరానన సహస్ర నామతుల్య । మట్లుగావునదీనినీవవధరింపు ॥ అనిశంకరుండు పార్వతికిబోధించినట్లు,

తారకనామ త్రిరావృత్తి పఠనంబుచే దేహత్రయ అవస్థాత్రయ జీవత్రయ పారిశుద్ధ్యులై సుఖించువారే భాగ్యులు.

ఈ మంత్రప్రభావము.

పద్యము॥ నిఖిలరోగంబులనిర్మూలముగఁజేయు-భవభయంబుల నెల్లపాఱదోలు । బంధనంబులపటాపంచలుఁగావించు - నోలయునాపద లనునులిమివైచు । శాత్రవవిజయంబుసతతంబుసమకూర్చు - తూలించు బహువిధదుఃఖములను । తలఁజూపకుండదుర్దశలనుతొలగించు - సకల శుభంబులసంగ్రహించు॥ పరమపావనమంగళప్రదముగాన। కలితధర్మార్థ కామమోక్షములలోన । నెసగుభక్తులకొసగినిదెద్దిలేదు । ఏమిఁజెప్పుదు శ్రీరామనామమహిమ ॥ అని ఆర్యులు పలికియున్నందున,

ఈ మంత్రరాజమును సద్గురునిచే యుపదేశింపబడి రహస్యార్థ ములనెల్ల శ్రవణమనన నిదిధ్యాసములచే అనుభవమునకు తెచ్చుకొన్న వారికి దాని మాధుర్యము గోచరమగును. గనుకనే సద్గురుస్వామియు,

దా్రవిడకీర్తన. రాగం-కమాస్-తాళం-ఆది.

పల్లవి.

రామనామమేకట్కుండు-ఇన్దరస మఱియారుళ్ మేకట్టుండు॥ రామ॥

అనుపల్లవి.

కామవిషయవస్తుక్కళై యరున్ది ప్పెరుం-కళప్పడైన్ద
వాయ్‌గళుక్కుం మధురంతరుం ॥ రామ॥

చరణము.

జానకిక్కుం సుఖంతన్దిడుంపొరుళిదువే - సరసిజభవశివపవనతనయషణ్ముఖ-సకలయోగిగళుం ఉగన్దదాల్ ఇదుపొదువే- ఆనదాల్ తారకం అఖిలశుభకారకం - ఆమిదెన్రునమ్బిచిన్న-సామి తుదిక్కుం ప్రసన్న ॥ రామ॥ అని తనఅనుభవమును పాడియున్నారు.

పద్యము॥ తారకయోగము దెలియగనేరక। వేదాంతవాక్యనికురంబముచే। నూరకవాదించుచుచెడువారికి। మోక్షంబుఁగలదె వాయుకుమార ॥ అనగా,

శ్లో॥ అకారోవహ్నిరిత్యుక్తః ఉకారస్సూర్య ఉచ్యతే।
మకారశ్చంద్రయిత్యుక్త ఏతత్తారకలక్షణం ॥

అనునట్లు బ్రహ్మప్రణవమందలి మండలత్రయ మధ్యగతంబై వెలుగునది తారకము. ఆ ప్రణవార్థమగు తారకబ్రహ్మమును అనుసంధానము జేయుటయే తారకయోగము. ఇట్టి యోగారూఢుల అనుభవము నెల్లవారునుపొంది సుఖించవలయును.

దా్రవిడవృత్తము.

అచ్యుతా అమలనెన్గో అడియపర్ వినైకెడుక్కుం
నచ్చుమామరున్దమెన్గో నలంకదల్ అముదమెన్గో
అచ్చువైకట్టియెన్గో అఱుసువై అడిసిలెన్గో
నెయ్‌చ్చువైత్తేఱలెన్గో కనియెన్గో పాలెన్గెనో ॥

దా్రివిడకీర్తన. రాగం-హుసేని-తాళం-రూపకం.

పల్లవి.

ఎన్నమధురమైయ్యా - రామనామం - ఎన్నమధురమైయ్యా ॥ ఎన్న॥

అనుపల్లవి.

కన్నలో కట్కండ్లో కర్జూరియో పాగో
కదలిక్కనియో కమలావో ఓగో ॥ ఎన్న॥

చరణములు.

1. ఆళినియో శీనియో తయిరో పాలో-అమ్రుతుక్కుంనెయ్యో వెణ్ణైయో తేనాలుం-పూశియద్రాక్షైయో తేనోశర్కరైయో-పోళియో అమ్బువడైయో తానానాలుం ॥ ఎన్న॥

2. తేన్కుఴలో మనోహరమో ముఱుక్కో - తిరట్టుప్పాలో డిడ్డలి పాలన్నమో - నాన్కుటిక్కిలిదు లడ్డో జిలేపియో - నావల్ గొయ్యా ముందిరిగళో ఎన్నమో ॥ ఎన్న॥

3. సత్తమనాగియవుత్తిరనైప్పెట్రు - సంతోషిక్కుంతన్దై తాయి నుదరమో - ఉత్తమనాయకి తానేమాలాగుంబో - దూడలిల్ కణవ నుణ్ణుం అదరమో ॥ ఎన్న॥

4. మేధావిగళాగి నిత్తియముక్తరాయ్ - విళఙ్గుం దివ్యకవిగళ్ వాక్కుక్కుం - ఆధారమాయిరుక్కిద్రదుం అల్లామల్ - ఆనందచిన్న సామిదాసర్ నాక్కుక్కుం ॥ ఎన్న॥

పంచముద్రలు.

పద్యము॥ వరుసఁ ఖేచరియన భూచరియన । మధ్యమయనంగ షణ్ముఖియనగా । వరశాంభవియనఁగల। పీధరలోపలముద్రలైదు తారకమునకుఁ ॥

1. కనులంపుమూసిస్థైమైన కడువిచ్ఛిస్థైమైన|భూ్రిమధ్యమునవచూపు మలచినిలిపి । యూర్ధ్వముఖముఁగాగ నోనరజూచిననది । ఖేచరియను ముద్ర కేశవర్య ॥

అనగా చూపును(తిప్పి భూ)మధ్యమమున చిదాకాశమునుఁ జూచుచుండుటయే ఖేచరిముద్ర.



రాగం - కాంబోది - తాళం - చాపు.

1. ఇదియేఖేచరిముద్ర ఇదినిత్యమగును - పదిలంబుగసాధింప బ్రహ్మాంబేయగును ॥ ఇది॥

2. చూపునిలిచినయపుడు రూపంబుగనుపడును - చూపునూ పొకటిగా పాపయగుపడును ॥ ఇది॥

3. పాపమధ్యమునందు పరంజ్యోతిరూపమై - దీపంబుకను పడును దివ్యపురుషులకు ॥ ఇది॥

4. అనయమగు చిత్తంబు లయముజెందినపుడే - బయలులో బయలు నిర్బయలుంగనుపిన్చుఁ ॥ ఇది॥

5. బయలులోపలనున్న ప్రణవంబురంజిల్లు-వేయి రేకులమీద వెలుగుగనుపించుఁ ॥ ఇది॥

6. సత్తు అనెడివత్తి సరసత్వముగజేసి - చిత్తు అనెడి చమురు చేవత్తిముట్టించి ॥ ఇది॥

7. చిత్తమలినముబాయ శ్రీగురునిసత్కృపను - ప్రత్యక్షమేగంటి పతిగానఁబడును ॥ ఇది॥

2. పద్యము॥ లోచనములుకదలింపక। ఆచార్యోక్తస్వ నాసికాగ్రం బెపుడుఁ । గోచరముగఁజూచిననది । భూచరియనుముద్రయగునుబోధ శరణ్యా ॥

3. పద్యము॥ కనులుసగముమూసి ఘననాసికామధ్యసీమయందుఁ జూపుఁజెదరనీక - నిలిపిమీదనున్న నిటలంబుఁగాంచిన । మద్యలక్ష్యమగు కుమారతిలక ॥

4. పద్యము॥ కర్ణలోచననాసాయుగంబుమూసి । మలచిభ్రూమధ్యమమునచూపులనుమనము।నిలిపివరనాదబిందుచిత్కళలఁగనుట। షణ్ముఖి ముద్రయంద్రుసజ్జనులువత్స ॥



కీర్తన. రాగం-యమకులకాంబోది-తాళం-చాపు.

1. ఇదిరాముక్తికిత్రోవ ఇదిరాసాధించు - అదిరాబూటకము ఒప్పమరానామతికి - వదలకగురుగొల్వు టిదిరా నెరనమ్మి - పదఁబడిలో చూపుచెదరనీయకురా ॥ ఇది॥

2. బొమ్మరింటిలోమంచి సొమ్ముయున్నదిరా-సొమ్మునూచేటం దుకు చూటియున్నదిరా - నెమ్మదిచూటికియొక నేర్పుయున్నదిరా - నమ్మరా ఇదికంటనాటియున్నదిరా ॥ ఇది॥

3. ఆరుత్రోవలుమూసి అందురొదవినుచు-పదూలుమూడన్న ఏకాంతమునను-ధీరాత్మయొకచిన్ని దిష్టిదూమచును-కారుచీకటిలోన కదలకనిలిచి ॥ ఇది॥

4. పాలుపొంద గురుమంత్ర భూతియొదచల్లి - తెలివిచీకటిగూడ దీవిముట్టించి- భలుభల్లని తెల్లవారె భానుఁడుదయించె - అలపట్టపగలై చుక్కలుగానుపించె ॥ ఇది॥

5. వెలయభూమిమధ్యమందు వెలుగుదీపించె - చెలరేగికళలతో చంద్రుడుదయించె-అలరుచు ఎఱుకతో అమరిచెన్నొందె-ఇలమీదపూ దోట ఏమన్నగురుఁడు ॥ ఇది॥

పద్యము ॥ అంతర్లక్ష్యముబహిరత్యంతవి । నిశ్చలసుదృష్టి యపగతపవన । స్వాంతవికారముగలయది । వింతయగుచునొప్పు శాంభవీముద్రయనగ ॥

ఇట్టి యోగాభ్యాసముఁ జేయువారలలో ననేకులకు ననేక విఘ్నములు సంభవించుటవలన నిది సాధించుటకు శక్యముఁగాని దని శంకింప, దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసనలను త్రివిధ వాసనలచేఁగలుగు ఆశలన్నియువిడిచి సద్గురుని సమీపమున నివసించి యతని పాదారవిందములయందలి యనన్యభక్తిఁగలవారై సద్భక్తి సహితముగ తారకబ్రహ్మము నుపాసనఁజేయువారికి అన్నివిఘ్నము లు దూరమగును.

ద్రావిడకీర్తన. రాగం-దర్బారు-తాళం-ఆది.

పల్లవి.

పనిడరే వరుగిన్రదు - మానిడరే ॥ పని॥

అనుపల్లవి.

వానిడత్తైక్కోరి - వణఙ్గి నామప్పాగిల్
మధురమళిన్దుకొళ్ళుం చతురరావీరాగిల్ ॥ పని॥

చరణములు.

1. అజ్ఞనైత్తరుం ఉన్ది అంబుజనై మత్తైగళోదుం- నిజనై యనవరతం భజనైప్పణ్ణువీరాగిల్ ॥ పని॥

2. వర్ణాశ్రమప్పడి సువర్ణాయూథకథైయిల్ - కర్ణానందమడైన్దు సార్ణావరావీరాగిల్ ॥ పని॥

3. ముక్తియుం అనంతశక్తియుం అధిగ-విరక్తియుంతరుం రామభక్తి పణ్ణువీరాగిల్ ॥ పని॥

4. మన్నవనాగినై యిన్న దెట్రటిన్దు-చిన్నసామిదాసన్ శొన్నదటివీరాగిల్ ॥ పని॥ అనిబోధించి గురుండుమరల,

శ్లో॥ అంతర్లక్ష్యం బహిర్దృష్టి ర్నిమేషో న్మేషవర్జితా ।
ఏషాసా శాంభవీముద్రా సర్వతంత్రేషుగోపితా ॥

ఈ శాంభవీముద్రకు లక్ష్యములు మూడుగలవు:—

శ్లో॥ త్రిషులక్ష్యేషుయోబ్రహ్మ సాక్షాత్కారంగమిష్యతి ।
జ్ఞానేనాదమనోవృత్త్యా లయతోరాజయోగవత్ ॥ అనగా,

వ॥ కనురెప్పలురెండు కలియమూసి నాసికాగ్రమందు చూపు నిలిపి జ్యోతిర్మయ దీపాంకురంబుగా భావించి తత్తేజంబును జూచుచుండుటయే అమావాస్యదృష్టి ; ఇది అంతర్లక్ష్యము.

2. కనురెప్పలురెండు, మూడుపాళ్లుమూసి వెలపలి రెప్పపాటు లేకుండునటుల మధ్యనాసికాగ్రంబునందు దృష్టియుంచి చెదరకుండు

గుబుర యందున్న రావిలుప్య జ్యోతిరూపంబుగా జూచుట పాథ్యమి దృష్టి ; ఇది బహిర్లక్ష్యము.

3. ముఖము కొంచమెత్తి నల్లగ్రుడ్లు పైరెప్పల యందు పోలా గుంజేసి అడుగురెప్పలలో తెల్లగ్రుడ్లు వెలుపల కనుపించులాగునుంచి చలనము లేక స్థిరబుద్ధిగలవారై జ్యోతిర్మయాకాశంబును బొడగని తత్తేజోమయంబున సర్వంబునుమఱచి నిరామయంబైన బ్రహ్మనిష్ఠ మధ్యలక్ష్యంబనఁబడును.



రాగం-సౌరాష్ట్రం-తాళం-చాపు.

పల్లవి.

యోగిగావలెరా - తారకరాజ - యోగిగావలెరా॥ యోగి॥

అనుపల్లవి.

యోగిగావలెనఖిలభోగవిరాగియైసంసారదుఃఖ - వియోగియై మోక్షలక్ష్మిసంయోగియై రంజిల్లుచుశివ॥ యోగి॥

చరణములు.

1. పవనంబంధించి-కుండలి ఊర్ధ్వపదముకుఁబెంచి ! తవిలిషోడశదళవిశుద్ధం బవలతారకమండలమ్ముపై - నవవిధంబులద్రించి మోక్షియు ప్రణవరవమునుఁ గలిసికొని శివ॥ యోగి॥

2. కన్నులుమూసి-సన్నపుదిక్కతిన్నగదీసి! తన్నెరుంగకమిన్ను జూచుచు వెన్నెలన్నియునేకముగనొక - వెన్నెలై చెలుపొందివెలుగుచు నున్నదీపముఁగలిసికొని శివ॥ యోగి॥

3. శిరమధ్యమ్మునను-బ్రహ్మానందం పరిపూర్ణమునను! వరసుధారసపానపరవశభరితమునన్నిరవుకొనినిరతము- వరమతత్త్వతేరియకులజుని పరమగురువరుగలిసికొని శివ॥ యో॥

వచనం॥ పదికళలుగలఅగ్నిమండలపన్నెండుకళలుగల సూర్యమండల, పదియారుకళలుగలచంద్రమండల, ఈమూడుమండలములయం

దలి ముప్పదియెనిమిదికళలనుఁ జూచుటకు సాధనములైన అంతర్లక్ష్య ముఁగల ఖేచరి షణ్ముఖి శాంభవి, బహిర్లక్ష్యముఁగల భూచరి, మధ్య లక్ష్యముఁగల మధ్యముద్రలలో నొకముద్రను,

పద్యము॥ సద్గురుపోక్తముద్రచే శ్రవణయుగము। మూసియాలింప ప్రణవంబు మోగియు మొదల। చిణియనుచు నంతటను చిణిచిణి యటంచు। మించి గెండవమారు ఘోషించుననఘ॥

అనునట్లు బ్రహ్మప్రణవ దశవిధనాదములగు చిణినాదము చిణి చిణినాదము, ఘంటానాదము, శంఖనాదము, వీణానాదము, తాళనాదము, వేణునాదము, భేరీనాదము, మృదంగనాదము, మేఘనాదము లను ఆలించి, చిద్బిందువును ఆబిందువందలి చిత్కళలను దర్శించి సుఖింపవలయు.

శ్లో॥ ఆగమార్థంతుదేవానాం గమనార్థంతురాక్షసాం।
కురుఘంటారవంతత్ర దేవతాహ్వానలాంఛనం॥

ఇట్లు ఆలించినపిదప,

పద్యము॥ సలలితేంద్రియగోపికలువరప్రీతిచే - చనుదెంచి తను పొందిసంతసింప। బ్రహ్మదండిలతావిభాస్వదా ధారాధి-కపికావళిమహావి కాసమొంద। ప్రస్ఫుటీకృతపటుస్ఫుటకుండలీంద్రుఁడ-త్యానందకరముగ్గా నాడుచుండ। పొందుగా భ్రూమధ్య బృందావనమ్మున-ప్రత్యక్షబోధగో పాలమూర్తి॥ విమలమానసపవనహస్తములచేత। తన సుషుమ్నా మురళి లీలదాల్చి మధుర-గాన మొనరించెననగనోంకార మలఘు। వేణునాద స్వరూపమై వెలయునంత.



ద్రావిడకీర్తన. రాగం-తోడి-తాళం-ఆది.

పల్లవి.

మేఘం ఇఱంగిన వైభోగత్తై ననాగ
విశ్వక్కేళుం మనదోనాగ॥ మేఘం॥

అనుపల్లవి.

ఏకచిత్తనాగి నమ్బుం - ఇవనుక్కెన్నైక్కణ్డు
ఇష్టవరం తన్దేనె - న్ట్రియంబుం గర్జనైకొణ్డు ॥ మేఘం॥

చరణములు.

1. దాసనామెనదు తాపతపనకిరణత్తాలే-దాగమాగక్కరుణా
సాగరత్తిలోరుక్కాలే - నేశమాయ్ త్తణ్ణీరుణ్డిన్ద్రి నీలమన్దైమెప్పోలే -
నెట్ట్రినమువినక్కుం నిర్మాలాకాసత్తిల్ మేలే ॥ మేఘం॥

2. భక్తియెన్నుం కైలాస పర్వతత్తినిల్ నామ - ప్పలమరంగళ్
శైవ్వియాయ్ప్పయిరాగుంబడివామ - వెట్ట్రికోదండ ఇన్ద్రివిల్లోడుం
కమలధామ - మిథిలైవల్లియెన్నుం మిన్నలోడుం రామ ॥ మేఘం॥

3. మానస సరోవరంవాయాల్ వళ్ళియచ్చెయ్య-మతికంజత్తటి
వన్నం మగిళ్ళన్దులావివెయ్య - దీనత్వచకోరంచిదయమారిపెయ్య -
చిన్నసామిదాసర్ జీవనసాధకం ఉయ్య ॥ మేఘం॥

ఇందు జెప్పబడిన తాపము ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికమని త్రివిధంబు.

వ॥ తన శరీరమునకుఁగలుగు చలిజ్వరము తలనొప్పి మొదలగు వ్యాధులవలన సంభవించెడు బాధలననుభవించునపుడును, తన యింద్రియములకుఁగలుగు గ్రుడ్డితనము మూగతనము మొదలగునవి సంభవించునపుడును, నేను వ్యాధిగ్రస్తుఁడను గ్రుడ్డిని మూగను అని దుఃఖించుట ఆధ్యాత్మిక తాపము.

2. పంచభూతములవలన బుట్టినవై తనకు నన్యములై తోఁచెడు నరులవలనను, పులులు కుక్కలు తేళ్ళు మొదలైన జంతువులవలనను కలిగెడు బాధలచేతను, తనకు నన్యులైన భార్యలు పుత్రులు మొదలగువారికి సంభవించు వ్యాధులవలన తనకు గలుగు దుఃఖముచేతను పరితపించుట ఆధిభౌతిక తాపము.

౨. తనకు నన్యమైన ప్రపంచమునకు అతివృష్టి అనావృష్టి గలుగు టయు, పిడుగులు మంటపములు జనులుమీదబడుట మొదలగునవి సంభవించుటను తానుజూచి లోకులకిట్టి కష్టములు పుట్టుచున్న వే నాకే మికీడు మూడబోవుచున్నదో యని దుఃఖించుట ఆధిదైవిక తాపము.

తాను దేహేంద్రియాదులకు విలక్షణుఁడు నిర్మలుఁడు నిరా కారుఁడనిఁ దెలియక పైఁజెప్పబడిన తాపత్రయములచే దహింపబడు నపుడు శ్రీగురునియొక్క అపార కరుణచే ఆత్మారామమేఘము దహ రాకాశమున వర్షించిన, తాను దేహేంద్రియాదులకు సాక్షినని జ్ఞానో దయముచే, తనకు నిట్టి తాపములు చల్లారును. ఈ తాపత్రయము సాక్షినగు నాకు లేదని తెలియుఁగువారే జీవన్ముక్తులు.

శ్లో॥ బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి సమహాత్మాసుదుర్లభః॥

అనునట్లు బహుజన్మసంసిద్ధియైనగాని స్వాతిరిక్తవస్తు సత్వజ్ఞాన శూన్యమైన బ్రహ్మజ్ఞానము గలుగ నేరదు. అంతపర్యంతము జననమర ణములను అలలుగల సంసారనదీప్రవాహమందు మునుగుచు తేలుచు తాపత్రయబాధ జీవునివదలదు. గనుక తాను పూర్వజన్మములయందుఁ జేసిన పుణ్యాపాపమిశ్ర కర్మఫలములైన సుఖదుఃఖములను,

శ్లో॥ అవశ్యంఅనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభం॥

అనునట్లు అనుభవించే తీరవలయునని మనశ్చలనములేక,

పద్యము॥ ఏకాలంబున నేవయస్సున నరుండేపూర ఏభూమిలో। ఏకర్మంబుసమాచరించవలెనో ఏమేమిచేయాడునో। ఆకాలంబున ఆవ యస్సున నరుండాపూర ఆభూమిలో। ఆకర్మంబు సమాచరించునుఁ గదా తథ్యంబు రాజోత్తమా॥

పద్యము॥ ఎచ్చటజన్మభూమి తనకెచ్చటజీవనమెందుసౌఖ్యమో। ఎచ్చటఖేదమో మరణమెచ్చట సంపదలెందుగల్గునో। అచ్చటకీడ్చువాని విధి అంబుజగర్భునికైనశక్యమా। వచ్చెడికీడుమేలొకరివల్ల వచ్చెననంగ వచ్చునే॥

అని యోచించుచు, సర్వకాల సర్వావస్థలయందును భవసాగరమును దాటించు ఆత్మారామునియందే తమ చిత్తమును సుస్థిరముగ నుంచి కృతార్థులై యుండవలయును.



ద్రావిడకీర్తన. రాగం-బ్యాగ్-తాళం-ఆది.

పల్లవి.

రామనైమఱవాదే - మనదే - రామనైమఱవాదే॥ రా॥

అనుపల్లవి.

కోమళమాయెవర్ భాషిత్తాలుం
కోపంకొణ్డెవర్గళ్ ద్వేషిత్తాలుం॥ రా॥

చరణములు.

1. ఎవర్గళెడుత్తెతిన్దుధూషిత్తాలుం - ఎవర్గళెడుత్తతిన్దు భూషిత్తాలుం - అవమానంభవక్కడల్ శోషిత్తాలుం - అల్లదధిగమాగ ఘోషిత్తాలుం॥ రా॥

2. తొన్దిరవుగళ్ తొడుత్తవర్ కొఱుత్తాలుం - తోణుంఅభీష్టమెల్లాంపఱిత్తాలుం - ఇన్దిరియంగళ్ వెళియినిలిఴుత్తాలుం - ఇష్టదేహం పుఴువాయ్ ప్పుఴుత్తాలుం॥ రా॥

3. బంధుజనంగళెల్లాం కఴిత్తాలుం-పరిజనంగళుం ఆగ్గినైయఴిత్తాలుం-ఎన్తుణైమెఱనెడుత్తవర్ ముఴిత్తాలుం - ఇల్లాళుం అలక్ష్యమాయ్ప్పఴిత్తాలుం॥ రా॥

4. అన్నమెఱనుకొణ్డాడియుగన్దాలుం-ఆశైప్పైగెయినాలలైన్దునొన్దాలుం-ఇన్నతున్బంగళై యెపర్ తన్దాలుం-ఎన్దవేళైయిలెదువన్దాలుం॥ రా॥

5. దుష్టకరుమంగళై త్తొగుత్తు మెన్నాలుం - స్వరూపలాభత్తై యడైన్దవన్ పోలుం-శిష్టవేదంకొణ్డ తిరుడనెన్రాలుం-చిన్నసామియెన్రాలుం ఒరుక్కాలుం॥ రామ॥

అనిబోధించి గురుండు మఱల,

పద్యము॥ ప్రతనుప్రాణమనో(గస్థిత బుద్ధియే। బిందువందుచె లగెడి ఆత్మప్రతిబింబమే। కళ పవనోన్నత ఘోషమే। సుమ్ము ప్రణవ నాదమువత్సా ॥

అనగా ప్రాణవాయుఘోషమే ప్రణవనాదము ఇదియె అకారము; మనస్సునకు అగ్రమందుండుబుద్ధియే బిందువు ఇదియే ఉకారము; ఇందు ప్రతిబింబమైన ఆత్మయేకళ ఇదియే మకారము: ఈ మూడుఁ గూడిన ప్రణవమే తారకంబు.

శ్లో॥ పంచభూతాదిసంయోగా జ్ఞాయతే నాదసంజ్ఞికం।
హృచ్చిత్తబుద్ధిసంయోగా జ్ఞాయతే బిందుసంజ్ఞికం ॥
క్షేత్రజ్ఞజీవచైతన్యం కళానామేతివిశ్రుతః।
బిందునాదకళాతీతం ప్రణవం మోక్షదాయకం ॥

పద్యము॥ ఆనాదబిందుకళల జ్ఞానంబడుచు। వానిగనుపురుషుఁడె ప్రజ్ఞాన। ఘనుఁడైనరాముఁడు నానావిధ। తత్త్వములకు నాథుఁడుపుత్రా॥

అని బోధించి తనయనుభవమును దెలుపుట:—

కీర్తన. రాగం-కల్యాణి-తాళం-రూపకం.

పల్లవి.

నేజూచినానే - బ్రహ్మమునాలో ॥ నే॥

అనుపల్లవి.

నేజూచినానమ్మ నెలతరో తారక
రాజయోగమునందు రంజిల్లుసద్గురుని ॥ నే॥

చరణములు.

1. కన్నులనడుమను సన్నబిలంబులో-నున్నతమైనట్టి పున్నమ చంద్రుని ॥ నే॥

2. చూపులలోపల పాపలనడుమను-వ్యాపించివెలిగేటి అపరం జ్యోతిని ॥ నే॥

3. పాలభాగమునందు నీలజ్యోతులనడుమ - వాలలాడుచున్న వరలింగమూర్తిని ॥ నే॥

4. చక్షురాగ్రమునందు అక్షయవీధిలో - నిక్షేపముగవెలిగే సాక్షిభూతమునాలో॥ నే॥

5. చందమామనడుమ కుందసాకృతియేమో - ఆనందముగవెలిగె హరిపోతులూరయ్యను ॥ నే॥

ద్రావిడవిరుత్తం.

పంగయక్కణ్ణనెన్గో పవళచ్చెవ్వాయనెన్గో
అంకదిరడియనెన్గో అంజనవణ్ణనెన్గో
శెంకదిర్ ముడియనెన్గో తిరుమరుమార్బనెన్గో
శంఖుచక్కరత్తనెన్గో జాతిమాణిక్కత్తైయే.



ద్రావిడకీర్తన.

రాగం - పరజు - తాళం - ఆది.

ప ల్ల వి.

ఎన్నశొల్వేన్ ఐయ్యన్ అళగు - ఇంగుదానేనీపళగు॥

అనుపల్లవి.

మున్నంకానమునిగళినమే - మోహిత్తదనైయూహిత్తుమనమే॥ ఎన్న॥

చరణము:

బిరమనాదిదేవర్గళుం ఏకో - బిత్తురుగుం గుణమదనాల్కా కో-దరశయనన్తన్నురువంపాగో-సర్కరైయో చిన్నసామినాన్ఓగో॥

శ్లో॥ దేహేతుపశ్చిమేభాగే వీణాదండాఖ్యదేహభృత్।
దీర్ఘాస్థిమూర్ధపర్యంతం బ్రహ్మదండీతికధ్యతే ॥

శ్లో॥ తస్యాంతేసుషిరంసూక్ష్మం బ్రహ్మనాడీతిసూరిభిః ।
ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ ॥

అనగా శిరోమణియగు సుషుమ్నా నాడియందు "సర్వంప్రతి ష్ఠితంతస్మిన్" అనునట్లు ఆపోజ్యోతియై వెలుగు ఉత్కృష్టమైన తేజస్సు ను, నామరూపాత్మకమగు దృశ్యప్రపంచము నతిక్రమించి అప్పుడప్పుడు కారణోపాధియగుమాయను దూరముగఁజేయుచు జూచి తన్మయుడై యుండవలయును.

పద్యము ॥ శ్రీకల్యాణ గురూపదేశరసమై తేజప్రవాహంబునై। లోకాలోకము లెల్లనిండిఘనమై లోమఃద్రనిద్రై గ్రసురా। నీకంబుఁగను త్రోవకాదిగతియై నిక్షేపమైనిత్యమై। రాకల్ పోకలు లేకతావెలుగు సద్వృత్తాంబు కేమ్రొక్కుదన్॥

హం స వ ర్ణ న.

వ॥ సర్వదృశ్యములకుసాక్షియగు శ్రీరామతత్వమే హకారం బు; మహావికారియై దృశ్యరూపిణియగుప్రకృతియే సకారంబు; దీని మధ్యగతబిందువే జీవుఁడు.

పద్యము ॥ వినుమాపురుషప్రకృతులఘన। తాదాత్మ్యంబుమ ధ్యగతబిందువుగా । ఘనహంసయనగజీవుండనిల। మనోయుక్తుఁడగు న తఁడువెలుంగున్ ॥

వ॥ ఇందుఁజెప్పబడినతాదాత్మ్యము త్రివిధంబు:—

1. చిత్తు అహంకారమందుప్రతిబింబించి ఆప్రతిబింబమును అ హంకారముంగూడి తప్తాయఃపిండమువలెనొక్కటై చిత్తువలెతోచును; ఆచిత్ ప్రతిబింబముఁనఁగూడిన యహంకారమునకు అప్రతిబింబముతోడి తాదాత్మ్యము సహజన్యతాదాత్మ్యమనంబడును.

2. ఆచిత్ ప్రతిబింబమునుఁగూడి చిత్తువలెఁదోచునట్టి యహం కారము స్థూలదేహముతోడితాదాత్మ్యము, జాగ్రత్ భోగమైనకర్మ ముజనించునపుడుజనించి ఆకర్మమునశించెనేని తానునునశించును; ఈ కారణంబువలన స్థూలదేహము చేతనంబువలెఁదోచును; ఇదియే కర్మ జన్యతాదాత్మ్యమనంబడును.

3. నేను బ్రాహ్మణుఁడను శూద్రుఁడను సన్న్యాసిని గృహస్థుఁడను అను చిత్తవృత్తులతోఁ గూడియుండెడు అహంకారబలత్వార్థమైన సాక్షితోడి తాదాత్మ్యము భ్రాంతిజన్యతాదాత్మ్యమనంబడును.



ద్రావిడకీర్తన. రాగం - బ్యాగ్ - తాళం - ఆది.

పల్లవి.

భ్రాంతిపోల్లాదె - జీవత్వ భ్రాంతిపోల్లాదె॥

అనుపల్లవి.

శాంతియిల్లామల్ చంచలమేర్కుం - జగత్తై నానావిధమాయ్ ప్పార్కుం॥ భ్రాంతి॥

చరణము.

ఇరున్దునడన్దుకిడన్దెళున్దిరుం ఇన్ద దేహంజడమెన్రు - తెరిన్దుకొళ్ళామల్ హితాహితంగళై దేహం శెయిదదెన్రునిన్రు । పొరున్దుంతన్నిలై పూన్డు మెయ్‌జ్ఞాన-బోధంకొణ్డు పరిపూరణవాన - పెరుంశీరిరప్పారుళ్ మయమోన - బ్రహ్మానంద విరోధియాన॥ భ్రాంతి॥

వ॥ అనఁగా సర్వాధిష్ఠానమైన ఆత్మస్వరూపము తానని యెఱుంగనందున ఈ భ్రాంతిజన్యతాదాత్మ్యముఁ గలిగెను. ఎవ్వరు తాదాత్మ్యత్రయమును సద్గురుసన్నిధిని విచారించి యిది యహంకారాదులకు గాని సాక్షియు నిర్వికారియు అసంగుఁడు నైన తనకు లేదని యెఱుంగుదురో వారే రాజయోగులు.



రాగం - లలిత - తాళం - ఆది.

1. సువ్విరాజయోగికిని సువ్విముక్తికాంతకును-సువ్వియనుచు పాడరే సుదతులందరు॥ సువ్వి॥

2. శ్రీకరంబుగాను నేఁడు శివునికల్యాణమిపుడు - శ్రీకైలాసమందుఁ జేయుచుండిరి॥ సువ్వి॥

3. అండపిండమునెటిబ్ర హ్మాండమధ్యమేడలోను - విష్ణుతుద్రు డజునితోటి వియ్యమందిరి॥ సువ్వి॥

4. ముక్తికాంతతోనుగూడి మూలపీటియందునెక్కి - భక్తి హెచ్చియైక్యమిచ్చె పావరావె॥ సువ్వి॥

5. ఓంకారలక్ష్మిరావె ఓం ఆపోజ్యోతిరావె - సాకారచెలియ రావె సత్తురావె॥ సువ్వి॥

6. కోటిశబ్దునాదురావె కోటిమూలదంచుదాము - సూటిబిం దుసుందరిరావె సుమనరావె॥ సువ్వి॥

7. స్వాతికాకళయురావె సాంఖ్యతారకాంగిరావె - సదయ అమనస్కరావె శాంభవిరావె॥ సువ్వి॥

8. చతురాక్షరిచక్రిరావె షడాక్షరిముద్రిరావె - విదితదశాక్ష రిరోరావె విమలరావె॥ సువ్వి॥

9. ద్వాదశాక్షరిరోరావె దైవషోడశాక్షరిరావె - తత్త్వద్వాద శగాదిలోను దంచుదాము॥ సువ్వి॥

10. ప్రకృతివడ్లువికృతివడ్లు ప్రళయవడ్లుపంచవడ్లు - సుకృతివడ్లు సూర్యవడ్లు సూచిపొయ్యరె॥ సువ్వి॥

11. కర్మవడ్లువిషయవడ్లు జ్ఞానాజ్ఞానవడ్లు - మర్మవాయువడ్లు దెచ్చి మరియుంబొయ్యరె॥ సువ్వి॥

12. ఈషణత్రయపువడ్లు వేషషడ్వర్గువడ్లు- దూష్యభావికార వడ్లు దుర్మతవడ్లు॥ సువ్వి॥

13. నీటుగాషడూర్మివడ్లు నిత్యషడ్భ్రమలవడ్లు - విస్ఫుటష్ట పాశవడ్లు ఇంద్రియవడ్లు॥ సువ్వి॥

14. తాపత్రయపువడ్లు తత్త్వపంచవింశతివడ్లు- అష్టగర్భమత్త పువడ్లు అడవివడ్లు॥ సువ్వి॥

15. జ్ఞానేంద్రియముసలం జ్ఞానకంకణంబుగట్టి - నిదానసిద్ధాసనమందు దంచుదాము॥ సువ్వి॥

16. ఖేచరిముద్రతోటి కీలుపొట్టూడదంచి- మంచిసన్నబియ్యమిపుడు ఘరియుచెయ్యరే॥ సువ్వి॥

ఇట్లు రాజయోగులకు సువ్విపాడమనుచు, గురుండుమఱల

శ్లో॥ షట్చతానిగణేశాయ షట్సహస్రం స్వయంభువే।
విష్ణవేషట్సహస్రంతు షట్సహస్రం పినాకినే।
సహస్రంఆత్మనేచైవ సహస్రం పరమాత్మనే।
సహస్రంఏకంగురవే అర్పయామి కృతంజపం॥ అనగా,

వ॥ గుదస్థానంబున వ శ ష స చతుర్వర్ణగంబై,చతుర్దళయుక్తంబై, తప్తకాంచనపుష్పసన్నిభంబై,పృథ్వీమందిరంబై, ఘ్రాణకారణంబై, మూలాధారచక్రంబు రంజిల్లునందు వినాయకునకు 600లును; లింగస్థానంబున బ భ మ య ర ల షడ్వర్ణగంబై, షడ్దళసమన్వితంబై, రక్తవర్ణంబై, ఆపోమందిరంబై, రసనాకారణంబై, స్వాధిష్ఠానచక్రంబు రంజిల్లునందు చతుర్ముఖునకు 6000లును; నాభిస్థానంబున డ ఢ ణ త థ ద ధ న ప ఫ దశవర్ణగంబై, దశదళసమన్వితంబై, పీతవర్ణంబై, తేజోమందిరంబై, నేత్రకారణంబై, మణిపూరకచక్రంబు రంజిల్లునందు శ్రీమహావిష్ణునకు 6000లును; హృదయస్థానంబున క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ ద్వాదశవర్ణగంబై, ద్వాదశదళసమన్వితంబై, శ్వేతవర్ణంబై, వాయుమందిరంబై, త్వగింద్రియకారణంబై, అనాహతచక్రంబు రంజిల్లునందు రుద్రునకు 6000లును; కంఠస్థానంబున అకారాదిషోడశ వర్ణగంబై, షోడశదళసమన్వితంబై, నీలవర్ణంబై, ఆకాశమందిరంబై, శ్రోత్రకారణంబై, విశుద్ధచక్రంబు రంజిల్లునందు జీవాత్మునకు 1000న్ను; భ్రూమధ్యస్థానంబున హం క్షం అను ద్వివర్ణగంబై,ద్విదళసమన్వితంబై,మాణిక్యవర్ణంబై, అంతఃకరణమునకును తద్వృత్తులగు కర్తృక్రియహేతువులను బాహ్యత్రిపుటులు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయములను అంతరత్రిపుటులు,

ద్రష్టృ దర్శన దృశ్యములను మధ్యత్రిపుటులు ఈ నవవిధసంస్కారములు, లేక, అంతరనవవిధప్రపంచమునకు మందిరంబై, ఆజ్ఞాచక్రంబు రంజిల్లు నందు పరమాత్మునకు 1000ను; బ్రహ్మరంధ్రస్థానంబున ఓంకార వర్ణగంబై, సహస్రదళసమన్వితంబై, కోటిసూర్యప్రకాశమానంబై, అంతఃకరణమునకును తద్వృత్తులకునువిలయస్థళంబై, సహస్రారచక్రంబు రంజిల్లు నిందు శ్రీగురుస్వామికి సహస్రంబును ఇట్లుప్రతిదినంబు శ్రీగురూపదేశ ముద్ర మంత్ర ధ్యానక్రమపూర్వకంబుగా సమర్పించుయోగి బ్రహ్మక్షేత్రదర్శనముచే జ్ఞానవంతుండై జీవన్ముక్తుండగును.

ద్రావిడవిరుత్తం.

అల్లల్పడుం ఓరొన్పదు వాసల్ పెరువాసల్
ఆరుంఅఱివార్గళ్ అఱియార్గళోరువాసల్
శొల్లప్పడు తిల్లైచ్చిఱువాసల్ పడిమిాదే
శూత్రంపలకరణాదిగళ్ వాత్రంమణివాసల్
తిల్లైప్పదియఱుగే యుడైయాళమెనలాగుం
శేరుంకనికాణుం పళితీరుం పరత్తోడుం
శెల్లప్పడుం అల్లల్పలనూల్ కట్ట్రదినాలే
శిన్నంశిఱువాసల్ పుగలామో శొలుమనమే.



ద్రావిడకీర్తన. రాగం - కళ్యాణి - తాళం - ఆది.

పల్లవి.

తిరుముక్కూడలిల్ తీర్థమాడినానే - పళ్ళియశీవరత్తైక్కండేనే॥

అనుపల్లవి.

ఒరుముక్కూడలుమట్ట్రొరుముక్కూడలుంపోగ- ఇరుముక్కూడల్లైయుం ఇఱన్దు పునిదనాగ॥ తిరు॥

చరణములు.

1. కువలయత్తిల్ శిఱన్ద కుత్తనూరిల్ సిఱ్ను - వివహారప్పదమే
సుం వెంగళత్తూర్ శెఱ్ను - అవమాగుంకామప్పా లాట్ట్రియుం తాణ్డి
సఱ్ను - తవప్పగైయాంశీన విషాట్ట్రియుంతాణ్డియిఱ్ను॥ తిరు॥

2. ఆశైయాంవేగవతి ఆట్ట్రియుంతాణ్డివిట్టు - మూశుదవుం
మోహక్కడ్చి మానగర్ పుఱప్పట్టు - వాసమదాదిదణ్డు శీవరంవిట్టిన్న
ముంనట్టు - కాశినియిల్ వారాద సంకల్పంపణ్ణినదైత్తోట్టు॥ తి॥

3. శొన్నపొరుళటిన్ద శుద్ధచిత్తరాయ్ప్పణ్డు - తుఃస్సంభవం
ఒఴిన్దు శుభరూపనాగుంవిణ్డు- పొన్నడిగళిల్ తొణ్డు పురివార్ గళెఱ్ను
కణ్డు - చిన్నసామిదాసన్ తెరివిత్తానందంకొణ్డు॥ తి॥

వ॥ గర్భగృహమునందలి యుంచియున్న దీపకాంతి తలుపుసందులద్వారా వెలుపలికిప్రసరించులాగున శిరస్సులోపల సహస్రారమునందు జ్యోతిర్మయముగానున్న శుద్ధసత్వఆత్మారామప్రకాశము సహస్రారమునకు అధఃప్రదేశముననున్న బ్రహ్మరంధ్రమునుండి వెలుపలికి ప్రసరించుచుండును. ఈశుద్ధసత్వభాగప్రభకు ప్రజ్ఞయని చెప్పఁబడును. ప్రపంచవిషయములకు నెల్ల సాక్షీభూతమైయుండు ప్రజ్ఞానమను ఆత్మారాముని సద్గురుముఖముగ “ప్రజ్ఞానంబ్రహ్మ” యను మహావాక్యద్వారా నెరుంగవలయును. ఇట్టి యాత్మారామస్వరూపమునెరుగక లోకులు ఆత్మయందు మిథ్యాజీవత్వము నొకదానినారోపించి బహువిధదుఃఖములననుభవించుచున్నారు. స్థిర నిర్మల నిశ్చల చిత్తవృత్తిగల వైరాగ్యసంపన్నులు దేహమునకును ఇంద్రియములకును ప్రాణమునకును అంతఃకరణములకును జీవాంధకారమునకును అవ్వల వెలుగుచున్న ఆత్మస్వరూపము సద్గురుసన్నిధిని శ్రవణమాత్రంబున దృఢముగ దెలిసికొని యానందింతురు. మధ్యమాధికారులు పైజెప్పిన నియమంబుతప్పక ప్రతిదినంబు యామధ్యయంబునభ్యసించిన షణ్మాసఁబుల

కుసు, మందప్రజ్ఞులు సంవత్సరంబునకును; కేవలమూఢాత్ములు ద్వాదశవర్షంబులకు పరమసూక్ష్మ తారకయోగ సిద్ధిఁజెంది సుఖింతురు.



ద్రావిడకీర్తన-రాగం-వసంత-తాళం-రూపకం.

పల్లవి.

తోట్టమొన్రుపోట్టోం - ఇదై దుష్టర్కిట్టవోట్టమాట్టోం॥ తో॥

అనుపల్లవి.

వాట్టమిల్లాదమానసకాసార త్తిల్ - వారియిత్తైక్కుంవగ్గై శెయ్దుతీర త్తిల్॥ తో॥

చరణములు.

1. రామనామద్రాక్షై-నడువిల్వైత్తదపేక్షై। వామదేవణసర్వాణి కావలాగ-వైత్తు క్కొత్తిచ్చుత్తి యణైత్తుఅవలాగ॥ తో॥

2. కృష్ణనామరసాలం - కిట్టవైత్తదనుకూలం।విష్ణురాధగురువృద్ధిపణ్ణతుయ్య - వేదవ్యాసణ మేల్ విచారణై శెయ్య॥ తో॥

3. నరహరినామకదంబం-నట్టదైయెన్నాళుంవిరుంబుం। ప్రహ్లాదణ పేరుక్కుగుత్తగై-బ్రహ్మాదిదేవ రటియత్తన్నివ్వగై॥ తో॥

4. నారాయణనామాశీని- నాట్టియదిలభిమాని। పారాయణం శెయ్యుం నారదయోగి - భక్తరుం చిన్నసామియుంఅన్భాగి॥ తో॥

మంగళం.

రాగం - సురటి - తాళం - చాపు.

1. మంగళంమంగళం-సద్గురుమూర్తి - మంగళంమంగళం-చిన్మయానంద-మంగళం॥ మం॥

2. నాదుబిందాయ బిందునాదాయ - బిందుబీజమునందు భేదములాయా- బిందుబీజమునందు భేదముదెలిసి-సందేహాలుడిగితె సర్వాంతానాయ॥ మం॥

3. సత్తుతానాయ చిత్తుతానాయ - సత్తుచిత్తులోనె సమరస మాయె - సత్తుచిత్తులోనె సమరసంతెలిసితే - వత్తిలేనిజ్యోతి వెలుగుతానాయ॥ మం॥

4. క్షరముతానాయ అక్షరముతానాయె - క్షరముఅక్షరము లెశాశ్వితమాయె - క్షరముఅక్షరములశాశ్వితమెఱిగితే - అమనస్కారంబాయె అంతతానాయె॥ మం॥

5. చూపుతానాయె రూపుతానాయ - చూపురూపులోనె ప్రకృతమాయె - చూపురూపులోనె ప్రకృతముతెలిసితే - పాపములేదాయె పావనమాయె॥ మం॥

6. మాయకుజీవాయె మాయకునీవాయె - మాయయిరువైయైదు మంత్రములాయె - మాయయిరువైయైదు మంత్రముతెలిసితే - మాయమాయమాయ మరియొక్కటాయె॥ మం॥

7. అంగలింగమాయె లింగమంగమాయె - అంగలింగముసందు అనుభోగమాయె - అంగలింగముసందు అనుభోగంతెలిసితే-లింగముతానాయ లీలతానాయె॥ మం॥

8. నేనునీవాయె నీవునేనాయె - నీలోమర్మములే నిజబోధలాయె - నీలోమర్మముల నిజబోధతెలిసితే - మానాభిమానము మరినిల్వదాయె॥ మం॥

9. గురువుశిష్యుడాయె శిష్యుడుగురువాయె - గురువుశిష్యునిసందు గురియొక్కటాయె - గురుడుదత్తాత్రేయ హరుడనినమ్మితే-ఎఱుకలేనినిత్యం ఏమిలేదాయె॥ మంగళం-మంగళం- మంగళమూర్తి॥

ఓం శ్రీకృష్ణప్రీయతాం. ఓం తత్ సత్.

ద్రావిడవృత్తము.

ఎన్నడైమనదుబుంది - యిందియశరీరమెల్లాం
ఎన్నడైయటివినాలే - యిరవిముఖ హిమమేయాక్కి
ఎన్నడైనీయుంనానుం - ఏకమైప్రైక్యంశెయ్యా
ఎన్నడైగురువాయ్త్తోన్రిమ్ - ఈశనైయిఱైంజినేనే.

అని స్తుతించిన సచ్ఛిష్యులకు గురుండు :—

శ్రుతి॥ "బ్రహ్మణోఽవ్యక్తః అవ్యక్తాన్మహతః మహతోఽహంకారః అహంకారాత్పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని పంచమహాభూతేభ్యో అఖిలంజగత్"

అనగా అఖండసచ్చిదానంద అద్వితీయనిర్గుణపరబ్రహ్మంబునం దు అవ్యక్తముగనుండు శుద్ధసత్వశక్తి వ్యక్తమై మలిన సత్వగుణమాయయై తనయందు ప్రతిబింబించిన ఆభాసచైతన్యంబును తనకునాధారంబగుబ్రహ్మచైతన్యంబును తానుఁజేరి సగుణబ్రహ్మంబని ఈశ్వరనామంబుచే వ్యవహరింపబడునది మహత్తత్వంబనంబడును.

2. ఈశక్తి మలినస్వరూప రజోగుణ అవిద్యయనఁబడగి తనయందుప్రతిబింబించినచిదాభాసుండును తనకునాధారంబగు కూటస్థుఁడనెడి బ్రహ్మచైతన్యంబును తానుఁజేరి జీవుఁడని వ్యవహరింపబడునది అహంతత్త్వమనంబడును.

3. ఈశక్తి తమోగుణస్వరూపిణియై జీవేశ్వరభోగంబుకొఱకు శబ్ద స్పర్శ రూప రస గంధంబులను అపంచీకృత సూక్ష్మపంచమహాభూతంబులై పంచతన్మాత్రలని వ్యవహరింపబడును. ఇవియే సప్తావరణములు. గనుకనే యీరహస్యార్థమును సూచింపుకొఱకు శ్రీరంగమున శ్రీరంగనాథునిసన్నిధికి సప్తప్రాకారము లేర్పడియున్నవి.

పద్యము॥ తనరజోగుణముచేతనరంగనేదేవి - కల్పించునఖిల లోకములనెల్లఁ । తనసత్వగుణముచేనొనరంగనేకొమ్మ - పోషించునీసర్వభూతములను । తనతమోగుణముచేతగనేవధూమణి - జగముల నెల్లసంక్షయముజేయు । తాశుద్ధసత్వప్రధానమైయేరామ-రామాంకమున నజస్రమువసించు॥ నట్టిభువనైకమాత దయాసమేత । సద్గుణవ్రాతనిర్మల స్వాంతపూత । భక్తజనమానసోద్యాన పారిజాత । సీతకరుణించి నన్నురక్షించుగాత ॥

భావము॥ శుద్ధబ్రహ్మంబునందు పైఁజెప్పిన అభిన్నముగనుండు శక్తివ్యక్తమై పురుషసన్నిధానమున స్త్రీలకు సుఖము జనించులాగున బ్రహ్మసన్నిధానమున తానే మూలప్రకృతిస్వరూపిణియై వికృతమైన సత్త్వరజస్తమములతోఁ గూడియుండును. ఆ మూలప్రకృతి సత్త్వగుణమునకు మాయయని సర్వజ్ఞయుపాధియనియుఁ జెప్పఁబడును. ఈ మాయయందు నిర్మలజలప్రతిబింబమువలె బ్రహ్మము బింబించినందుకు ఈశ్వరుఁడను నామముకలిగెను. ఈమాయయే ఈశ్వరునకు కారణశరీరము. ఈ మాయయొక్క సత్త్వగుణమునందు ప్రతిబింబమైన ఈశ్వరుడు జగత్తును రక్షించుటచేత విష్ణువనియు, రాజసమునందు ప్రతిబింబమైన ఈశ్వరుఁడు జగత్తును సృష్టించుటచేత బ్రహ్మయనియు, తామసమునందు ప్రతిబింబమైన ఈశ్వరుఁడు జగమును లయమునుజేయుటచేత రుద్రుఁడనియు నామములుకలిగెను.

పైఁజెప్పిన మూలప్రకృతియొక్క రజోగుణమునకు అవిద్యయనియు కించిజ్ఞ ఉపాధియనియుఁ జెప్పబడును. ఈ అవిద్యయందు మలినజల ప్రతిబింబమువలె బ్రహ్మముబింబించినందుకు జీవుఁడను నామము కలిగెను. ఈ అవిద్యయే జీవునికి కారణశరీరముగును. ఈ అవిద్యయొక్క సత్త్వగుణమందు ప్రతిబింబమైనజీవులు తత్త్వజ్ఞాననిష్ఠులు రాజసమందు ప్రతిబింబమైనజీవులు కర్మనిష్ఠులు తామసమందు ప్రతిబింబమైనజీవులు పశుపాత్రియులు.

మూలప్రకృతియొక్క తమోగుణము ఆవరణవిక్షేపమను రెండు శక్తులుగనుండును. అందు ఆవరణశక్తి ఈశ్వరునితత్త్వజ్ఞానినివినా, తక్కినజీవులయొక్క తెలివినిమరిపించి దేహత్రయముల నేనని అభిమానింపఁజేయును.

ద్రావిడకీర్తన. రాగం-ఆఠభి-తాళం-ఆది.

పల్లవి.

మాయావ్యాపారం-అనదపారం
వాక్కుకక్కుం మనదుక్కుం ఎట్రావిస్తారం॥ మా॥

అనుపల్లవి.

ఓయామల్ జడమాం ఉడలైక్కణ్డు మోహా-ప్పేయాలలైయచ్చె
య్యుం ప్రభలమాగియ లోక॥ మాయా॥

చరణములు.

1. ఎచ్చిలిలైయెక్కణ్డిడై నిడైన్దునడక్కుం- ఇవనుడయంవరైయి
ల్ ఇదశాఴియెణ్ణుకిడక్కుం- కుచ్చిదవఴిపోగక్కూడాదెన్రుమడక్కుం-
గురుమొఴియైక్కడక్కుం కుటుంబిల్ తానేయడక్కుం॥ మా॥

2. మూత్తిర తైవఴియిల్ మోచనం శెయ్యదదెన్న - మూఢజన
మోవెన్రు ముఖంకడుత్తిడుం అన్ద-శాత్తిరగళుం అన్దమూత్తిరమధువన్ద-
సందాంభగతైక్కణ్డు సంతోషిక్కచ్చెయ్యుమిన్ద॥ మా॥

3. అనిత్తియకాయమెన్రటేన్దుంకరైయిల్లాద - ఆశైయడైన్దలైన్దు
అరుమఱైయుంశొల్లాద-పునిదనాం పరమపురుషనిడం శెల్లాద-పున్నైయె
యళిత్తిడుం తన్నైయొత్తపొల్లాద॥ మా॥

4. అనత్తిదు సత్తిదెన్రటియామల్ వర్నవర - అవసైకొణ్డుపెరి
యోరడిపణియామల్ పర-వసత్తిలిరున్దు జీవనం శెయ్యునిరంతర-వరుత్త
త్తిలెవరైయుం ఇరుత్తుంసర్వేశ్వర॥ మా॥

5. యోగత్తినిలటివై నన్రాగనాట్టుగిన్ర - యోచనైవిట్టుక్కర్మ
వాసనై క్కూట్టుగిన్ర-భోగత్తిలిచ్చైకొణ్డు పురుషన్ ఆట్టుగిన్ర- పొయ్యా
మిన్దజగత్తై మెయ్యాగక్కాట్టుగిన్ర॥ మాయా॥

6. ఆన్మా కేవలక్ ఆగయాల్ ఉళ్ వెళిక్కుం- అతీత నెన్రుణైత్తా
లప్పో దేతత్తళిక్కుం-ఊన్మాణావుడలై యున్మా దెన్రుంకళిక్కుం- ఉపా
యమదైమఱైత్తపాయత్తైయళిక్కుం॥ మాయా॥

7. తన్న టివైవిళక్కుం సద్గురుమొఴి తడుక్కుం-సామాన్యజనం
గళై చ్చారామలేవిడుక్కుం - చిన్నసామియైప్పోలే శ్రీరామనైయడు
క్కుం-తిటమైయిల్లాదవర్క్క త్తీమైగళైక్కొడుక్కుం॥ మాయా॥

పద్యము॥ నేననినతనువునకునభిమాన। మునకునర్థమగుప్రమా దమునలనక। గానవవిరెండనర్థములౌ। నేనన నేను కేవలాత్ముడనఘ॥

వ ॥ కేవలాత్ముడనిదెలియని దురభిమానమే అహంకారగ్రంధి యనియు సంసారబంధమనియుఁ జెప్పఁబడును.

పూర్వోక్త విక్షేపశక్తియందు శబ్దతన్మాత్రయగుఆకాశమునుఁ ఆకాశమునందు స్పర్శతన్మాత్రయగువాయువును, వాయువునందు రూప తన్మాత్రయగుఅగ్నియును, అగ్నియందు రసతన్మాత్రయగుజలమును, జలమునందు గంధతన్మాత్రయగుపృధివియునుపుట్టెను. ఇవియే అపంచీ కృతసూక్ష్మభూతములు వీటివల్లనే సూక్ష్మదేహముఁగలిగెను.

ద్రావిడకీర్తన. రాగం-యదుకులకాంభోది-తాళం-ఆది.

1. నిలత్తైప్పొరుళెణియుం నిలమదైయఱియాదు - నిశ్చయమిన్ద నిలంజడమే-జలత్తైప్పొరుళెణియుం జలమదైయఱియాదు - సత్తియమిన్ద జలంజడమే॥ ని॥

2. తేయువైప్పొరుళెణియుం తేయువదైయఱియాదు - తిణ్ణమిన్ద త్తేయువుంజడమే - వాయువైప్పొరుళెణియుం వాయువదైయఱియాదు- వణ్ణముళ్ళవాయువుంజడమే॥ ని॥

3. ఆకాశమదైయఱియాద దిదైయఱియుం - ఆగైయాలాకా శముంజడమే-ఏకాకారమాయ్ నిష్ప్రపంచమా - యిరుప్పదువేయెన క్కిరుప్పిడమే॥ ని॥

4. సకలంగళైయుంపొరుళెణియుం అన్దప్పొరుళై-సకలముంఅఱి యాదతత్తువమే-ఇహపరంగళ్ ముదలిరణ్డుగళైయగట్రి-యిరుప్పదువే నల్లమహత్తువమే॥ ని॥

5. ఇన్నదుతన్నిలై యెన్రఱిన్దిరుప్పవర్ - ఇనియొరు దేహముం ఎదుక్కాకే-చిన్నసామిమత మఱియాదవర్పోల్ - దేహనామంగళై యదుక్కాకే॥ ని॥

వచనము॥ పైజెప్పిన ప్రకృతియొక్క స్వరూపవ్యాపారంబులం దెలిసికొనుట నత్యావశ్యకంబులగుటవలన అవియిచట సంక్షేపముగఁ దెలుపుచున్నారు.

శ్లో॥ చతుర్వింశతితత్వాని కేచిదిచ్ఛంతివాదినః।
కేచిత్ షట్త్రింశతత్వాని కేచిత్ షణ్ణవతీనిచ॥

అనగా బ్రహ్మావాదులలోకొందరు యిరువదినాలుగు తత్వంబులున్ను, మరికొందరు ముప్పదియారుతత్వంబులనున్ను, మరికొందరు తొంబదియారు తత్వంబులనున్ను, యిచ్ఛయింపుచున్నారు. అందు, శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వాము ఘ్రాణంబులను అయిదు జ్ఞానేంద్రియంబులును, వాక్ పాణి పాదపాయువు ఉపస్థలనెడి అయిదు కర్మేంద్రియములును, ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానంబులను అయిదువాయువులును, శబ్ద స్పర్శ రూప రస గంధంబులను పంచతన్మాత్రలును, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అను అంతఃకరణచతుష్టయంబునుఁజేరి చతుర్వింశతి తత్త్వములగును.

వచనము ॥ 1. పూర్వోక్తత్రిగుణాత్మకంబులగు సూక్ష్మభూతంబులయందుఆకాశముయొక్క సాత్వికాంశంబువలన శ్రోత్రేంద్రియంబును, వాయువుయొక్క సాత్వికాంశంబువలన త్వగింద్రియంబును, తేజస్సుయొక్క సాత్వికాంశంబువలన చక్షురింద్రియంబును, జలంబుయొక్క సాత్వికాంశంబువలన జిహ్వేంద్రియంబును, భూమియొక్క సాత్వికాంశంబువలన ఘ్రాణేంద్రియంబును పుట్టెను. ఈ పంచభూతంబులయొక్క సాత్వికాంశ సమష్టివలన అంతఃకరణంబుబుట్టి అది వృత్తిభేదంబులచేత మనోబుద్ధి చిత్త అహంకారంబులాయెను.

2. ఆకాశముయొక్క రజోంశంబువలన వాగింద్రియంబును, వాయువుయొక్క రజోంశంబువలన పాణీంద్రియంబును, తేజస్సుయొక్క రజోంశంబువలన పాదేంద్రియంబును, జలంబుయొక్క రజోంశంబువలనపాయురింద్రియంబును, పృథ్వియొక్క రజోంశంబువలన ఉపస్థేంద్రి

యుంబునుకలిగెను. ఈ పంచభూతములయొక్క రజోంశసమష్టివలన ప్రాణవాయువుపుట్టి అది వ్యాపారభేదంబులవలన ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానంబులని పంచవిధంబులాయెను. ఇవియన్నియుంగూడి లింగదేహము లేక సూక్ష్మదేహంబనంబడును.

శ్లో॥ భూతానిచకవర్గేణ చవర్గే ణేంద్రియానిచ।
టవర్గేణతవర్గేణ ఘ్రాణిగంధాదయస్తథా ॥
మనఃపకారశ్చైవో క్తం ఫకారేణత్వహంకృతిః।
బకారేణభకారేణ మహాప్రకృతిరుచ్యతే॥
ఆత్మాతుసమకారేణ పంచవింశత్ప్రకీర్తితః॥

అనునట్లు ఇచ్ఛాప్రయత్నములేని సూర్యునియందు తనకిరణములచే మేఘముగలిగి ఆమ్మేఘమువలన వర్షోత్పత్తియై అవ్వర్షజలమందు ప్రతిబింబసూర్యుఁడుకలిగినట్లుబ్రహ్మమందు జీవేశ్వరాదిప్రపంచముద్భవించెను. గనుక,

శ్రుతి॥ పంచవింశదాత్మాభవతి। పంచవింశోయంపురుషః॥

అనగా మకారవాచ్యుఁడైన పంచవింశకుఁడు పురుషుఁడనంబడును చతుర్వింశతితత్వములు ప్రకృతియగును.

ఈ ఆత్మ అనాత్మవిచారముచే బ్రహ్మజ్ఞానంబుదయించును.

ఈ చతుర్వింశతితత్వంబులతోటి పంచీకృతమహాభూతంబులగు పృథ్వి ఆపః తేజః వాయుః ఆకాశంబను స్థూలపంచమహాభూతంబులును,స్థూలసూక్ష్మకారణములను త్రిశరీరంబులును,జాగ్రత్స్వప్నసుషుప్తులను అవస్థాత్రయంబును, వీనికెల్లకారణంబగు అవిద్యయుఁజేరి,

శ్లో॥ ఆహత్యతత్వజాతానాం షట్త్రింశత్ మునయోవిదుః॥

అనగా మునులు ముప్పదియారుతత్వంబులగునని జెప్పిరి.

పద్యము॥ ధరణిలోపలనారారు తత్వములకు। నవ్వలైయున్న తత్వంబు నెవ్వఁడెరుఁగు। శివుఁడుగురురూపముననచ్చిఁ జెప్పకున్న। నవ్యతరభోగిశ్రీసదానందయోగి॥

ఈ ముప్పదియారు తత్వంబులతోఁటి అస్తి జాయతే వర్ధతే పరిణమితే అపక్షీయతే వినశ్యతే అను షడ్భావవికారంబును, ఆశనా చ పిపాసాచ శోక మోహ జరా మృతియను షడూర్ములును, చర్మము రక్తము మాంసము మేదస్సు అస్థి మజ్జాయషట్కోశంబులును, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులనెడు అరిషడ్వర్గంబును, విశ్వ తైజస ప్రాజ్ఞులను జీవత్రయంబును, సాత్విక రాజస తామసంబులను గుణత్రయంబును, ప్రారబ్ధము ఆగామి సంచితంబులను కర్మత్రయంబును, వచనము ఆదానము గమనము విసర్జనము ఆనందంబులను కర్మేంద్రియవ్యాపారంబును, సంకల్పించుట నిశ్చయించుట ధారణముఁజేయుట అభిమానించుట అను అంతఃకరణవ్యాపారంబును, ముదిత కరుణ మైత్రి ఉపేక్షలను సద్గుణ చతుష్టయంబును, దిక్కు వాయువు సూర్యుఁడు వరుణుఁడు అశ్వినీదేవతలను జ్ఞానేంద్రియ అధిదేవతలును, అగ్ని ఇంద్రుడు ఉపేంద్రుఁడు మృత్యువు చతుర్ముఖుఁడు అను కర్మేంద్రియ అధిదేవతలును, చంద్రుఁడు బృహస్పతి క్షేత్రజ్ఞుఁడు రుద్రుఁడను అంతఃకరణ అధిదేవతలునుజేరి 96 తత్వంబులగునని ఆర్యులు పలుకుదురు.

శ్లో॥ యేషణ్ణవతితత్వజ్ఞా యత్రకుత్రాశ్రమేరతాః ।
జటీముండీ శిఖీవాపి ముచ్యతే నాత్రసంశయః ॥

అనగా, ఎవరు పూర్వోక్తంబులగు 96 తత్వంబులఁదెలియుచున్నారోవారు యెచ్చటనైన యేయాశ్రమంబునందాసక్తులైనను మునియైనను సన్యాసియైనను గృహస్థుఁడైనను నిస్సందేహముగ సంసారబంధమునుండి విడువఁబడుచున్నారు. ఇట్టి బంధవిముక్తియే తత్వజ్ఞానఫలంబుగాన తత్వవివేకులై,

శ్లో॥ ఏవంజితేంద్రియోభూత్వా సర్వత్రమమతామతిం ।
విహాయ సాక్షిచైతన్యే మయికుర్యాదహంమతిం ॥

అనగా జితేంద్రియులై సర్వవిషయంబులయందును నాదియను బుద్ధినివిడిచి సాక్షియగు తన నిజస్వరూపమందే నేననుబుద్ధినియుంచి,

ద్రావిడకీర్తన. రాగం-షరజు-తాళం-ఆది.

పల్లవి.

సాక్షిభూతపొరుళైయడైన్దు-మాక్షిపెట్ట్రేనే॥ సా॥

అనుపల్లవి.

తాక్షియొన్రిన్దపేక్షిత్తవగై-తీక్షిత్తుమతి సూక్షియాల॥ సా॥

చరణములు.

1. కాక్షియినాల్ ఈక్షిప్పదొన్రుం-ఆక్షియన్రెన్రుపేక్షిత్తేన॥ సా॥

2. వాక్షిమనదై మీక్షిశెయ్దు - మోక్షియెన్నై కృటాక్షియెన్రు॥ సా॥

3. ఆమిదెన్బదుంపోమిదెన్బదుం-నామిదైచ్చిన్న సామిమజన్దు॥ సా॥

వచనము॥ అనునట్లు కృతార్థులై సుఖింపవలయునని, మరల

శ్రుతి॥ స్థూలసూక్ష్మకారణశరీరేభ్యోవ్యతిరిక్తః పంచకోశాతీతః అవస్థాత్రయసాక్షీః చతుర్వింశతితత్త్వాధారః మాయయాప్రతీయమానాభ్యాం జీవేశ్వరాభ్యాంభిన్నః సచ్చిదానందరూపస్సన్ యస్తిష్ఠతి సఆత్మా ॥

అని ఉపదేశించుచున్నందున; పుష్పచందన స్త్రీ వస్త్రస్వర్ణాదులయందు పామరుండెట్లుప్రీతియుంచునోయటువలెను; వాదులనుగెలుచుటకిచ్ఛయించుపురుషుండు కావ్యనాటక తర్క వ్యాకరణాదులనెట్లు నభ్యసించునో యటువలెను, స్వర్గాదికామియగు వైదికుండు జప యజ్ఞ ఉపాసనాదులను శ్రద్ధాభక్తిపూర్వకముగా నెట్లుజేయునో యటువలెను, అణిమాద్యష్టైశ్వర్యలాభేచ్ఛంగలయోగి మహా ఆయాసముచేత చిత్తైకాగ్రంబు నెట్లుసంపాదించునో యటువలెను; ముముక్షువును పరమాత్మయైన తనను దేహాదులవలన విభజించిదెలియుటకిచ్ఛయించవలయును. ఎట్లనగా మాతాపితృల శుక్ల శోణిత సూతకములవలన

జన్యంబై చర్మము రక్తము మాంసము మేదస్సు అస్థులు సాడియుం గూడి కరచరణాద్యవయవాకారమై స్తంభమువలెదోచునట్టి దేహము స్థూలదేహమనియు, జ్ఞానేంద్రియపంచక కర్మేంద్రియపంచక ప్రాణాది వాయుపంచక అంతఃకరణచతుష్టయంబులంగూడినది సూక్ష్మశరీరమనియు, ఈరెంటికికారణమైన అజ్ఞానాంధకారఅవిద్యయే కారణదేహమనియుఁదెలియవలయును. ఈత్రివిధదేహములు జడములగుటచేత అనాత్మయనఁబడును. ఈ మూడింటి నెరుంగుచుండుప్రజ్ఞానమే ఆత్మయనంబడును. మరియు నీస్థూలదేహంబు అన్నమయకోశంబనియు, కర్మేంద్రియంబులును పంచవాయువులునుఁజేరినది ప్రాణమయకోశంబనియు, జ్ఞానేంద్రియంబులైదును మనస్సునుఁజేరినది మనోమయకోశంబనియు, తిరుగా జ్ఞానేంద్రియంబులైదును బుద్ధినిఁజేరినది విజ్ఞానమయకోశంబనియు, అవిద్యయైనకారణదేహము ఆనందమయకోశంబనియుఁ జెప్పంబడును. అనగా అన్నమయకోశము స్థూలదేహము, ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశములు సూక్ష్మశరీరము, ఆనందమయకోశము కారణశరీరము.

పద్యము॥ ప్రకృతియొక్కటిపాదుఫలములుసుఖదుఃఖ - ములు రెండుగుణములుమూడు వేళ్ళు । తగురసంబులునాల్గు ధర్మార్థముఖరంబు- లెఱిగెడివిధములైదింద్రియంబు । లారుస్వభావంబులాశోకమోహాదు-లూర్ములుధాతువులొక్కయేడు। పైపొరలెనిమిదిప్రంగలుభూతంబు-లైదుబుద్ధియుమనోహంకృతులును॥ రంధ్రములుతొమ్మిదియుఁగోటరములుప్రాణపత్రదశకంబుజీవేశపక్షియుగము । గలుగుసంసారవృక్షంబుగలుగజేయఁ । గావనడగింపరాజ ఒక్కరుఁడవీవ॥

వ॥ అనునట్లు ప్రకృతియొక్కసర్వవ్యాపారములు జరుగుచుండియు నసంగుడునై వీటికెల్లరాజునై వెలుంగు ఆత్మారామునిఁగనుగొను అపరోక్షజ్ఞానమొసగినసద్గురుని, శిష్యుండు

శ్లో॥ మాయావిద్యావిదూరాయ మహాచార్యస్వరూపిణే।
శంకరాచార్యదేవాయ తస్మై శ్రీజ్ఞానాత్మనే నమః॥

ద్రావిడవిరుత్తము.

శాత్తిరంకట్టుప్పిదట్టి త్తమైయుణాదవరోడే
గాత్తిరమేవడివాగి క్కాళ్ళిన్దువిడక్కాడపోన్నై
శాత్తిరంగిప్పళవేశం పన్నుంపరమపదత్తై
మాత్తిరైయోన్రిల్ వళంగుం వళ్ళలైనీవరక్కూవాయ్.

2. మేలైఅమరర్కుంమేలాం విణ్ణవన్మణ్ణిలిళిన్దు
మాలైయుంకాలైయుమిల్లా వగైయెన్తలమిశైవైత్తు
క్కాలైఅరుణాట్కాడన్ద కణ్ణుడైయానైయెన్కణ్ణై
శోలైయిల్వాళంకోయిలే స్వరూపనైనీవరక్కూవాయ్.,

అని యిట్లు ప్రార్థించుచు,

ద్రావిడవిరుత్తం.

ఇన్నముదుకనిపాగుకట్కంమశీనితే నెనరుచిత్తిడవలియమ
న్దిబంకొండుత్తనినై యెన్నేరంనిన్నన్బర్ ఇడైయఊడుదికిగినాడి
ఉన్నియకరుత్తవిళవ్పరైకుళటియుడలెంగుంఓయ్న్దయర్న్దవశమాగి
యుణర్ వళియపేరిన్బఅనుభూతియుణర్వేలే యుణర్వార్గళుళ్ళపడికాణ్
కన్నిగైయొరుత్తిశిట్రిన్బంవేంబెన్నినుం కైక్కొళ్వాళ్ పక్కువత్తిల్
కణవనరుళ్ పెఱిన్ మునేశొన్నవాఱెన్నెనక్కురుదినగైయావళదుపోల్
శొన్నబడికేట్కుమిప్పదైక్కునిన్కరుణైతోట్రిల్ సుఖారంభమాం
శుద్ధనిర్గుణమానసరదైవమే పరంజోతియే సుఖవారియే.

ద్రావిడకీర్తన. రాగం-కమాస్-తాళం-ఆది.

పల్లవి.

కాణామల్అరైక్కణం పలయుగమాగుదే-కలంగిమనంనోగుదే॥ కా॥

అనుపల్లవి.

శేణాళమవనయన్ శివసంభావనై
శెయ్యుం తేజోమయనై దేవాదిదేవనై॥ కా॥

చరణములు.

1. అమలకుల త్తిల్ పిఱన్దవళాఖివళ్ నమకా్కనవ ళౌ్రెన్ణి-యూడై యాభరణంగళధికమాయళి త్తదు మల్లామల్ దమైపణి- కమలకర త్తినా లెక్కక్రు త్తినిల్ తాలియై-క్కట్టివలదుకై పిడిత్తవనమాలియై॥ కా॥

2. పరపురుషరైసొప్పన త్తిలుంనినైయాద పతివ్రతైయా మెన్నై-పంచబాణా ఐంకణైయాలెయ్వదై ప్పార్తడియాళ్ మునైన్న-సరసమాగ వన్దుత్ర వాదమయ్యనై-శాట్టృవుంవారాదసదానందమయనై॥ కా॥

3. మెయ్యాగ త్తిరణ్డవళన్ను కైతట్టిపెత్త మిన్నిడైయనుభోగం - వేడిక్కైయాయిరుకా్క దెవిలెనక్కన్ద విరహమేదునిషేకం- శెయ్యామ లిరుక్కిన్ర దివ్యగుణాళనై -చ్చిన్న సామియెనుం తెరివైమణాళనై॥ కా॥

ఇట్లా ర్తిజెందియుండగా, గురుండు

పద్యము॥ నీవుపృథివిగావునీరగ్ని యునుగావు। మిన్నుగావునీవు, మీనికెల్లఁ। జెప్పిచూపరాని చిద్రూపమైనట్టి సాక్షిగాఁగఁ దెలియుమయ్య నిన్ను॥

2. నీవిద్విజాదివర్ణముగావింద్రియగోచరుడవుగావు నిజముగాను। భావింపనిరాకారుఁడవీ విశ్వంబునకుసాక్షి వికఘఖవగుమీ.

అనగా పంచభూతమయ ప్రపంచమందు స్థూలదేహముచేత సకలక్రియలుజేయునది జాగ్రదవస్థ; సూక్ష్మ దేహముతోఁగూడి జాగ్రత యందు కన్నదివిన్నదికోరినది సంకల్పమాత్రమున ప్రత్యక్ష్యముగనిద్ర యందనుభవించునట్లుండునది స్వప్నావస్థ; ఈప్రపంచంబేమియుఁదోచక శూన్యమై నిద్రయందానందముగమునిగియుండునది సుషుప్త్యవస్థ.

శ్లో॥ జ్ఞోలాయమానంగోవిందం మంచస్థంమధుసూధనం।
రథస్థంకేశవందృష్ట్వా పునర్జన్మనవిద్యతే॥

అనగా స్వప్నమనుఉయ్యాలలో నూగించుకొనుచున్నవాఁడును సుషుప్తియనుమంచమందు పరుండున్నవాఁడును అంతటను తిరుగుట

కుపయోగమైనజాగ్రతయను రథమువిూదకూర్చున్నవాఁడునైన ప్రత్య గాత్మ దేహాదులకంటెనన్యుఁడు పరమార్థస్వరూపుఁడని తెలిసిన పునర్జన్మ ము కలుగదని, గురుండుమరల

పద్యము॥ సాకారమసత్యంబు నిరాకారము సత్యమిట్లు నిశ్చయముగ నిశ్చయమ్మున ! నీకీతత్వము దెలిసిన నెక్కొనవు ! పునర్భవాది ఘోరదుఃఖ ములన్॥

2. ఏమి జెప్పుమనీ మేను ఈజగంబు ! లేదు నిశ్చయముగ నొకటి మైన! శుద్ధచిన్మాత్రమగు నాత్మను న్వ్యనేను! గాన నేకల్పనయు నాకు గలుగ దెపుడు॥

అనగా పైజెప్పినమూడవస్థలు విక్షేప ఆవరణశక్తులవలన గలిగెను. విక్షేపశక్తివలన పంచభూతములు గలిగి వాటిమేళనంబే స్థూల సూక్ష్మదేహములై వీటియవస్థలే జాగ్రత్స్వప్నములాయెను; ఈ రెంటిని ఆవరించుకొని ప్రపంచంబంతయు మరిపించుచునుండ్డునదే ఆవరణ శక్తియగు. జీవునికి కారణదేహమైన సుషుప్త్యవస్థ. ఈమూడుదేహము లొకటినొకటి నెఱుంగవు. గాన అనృత జడ దుఃఖస్వరూప మాయామయ మనదగును. ఈ దేహాదులకు విలక్షణుఁడై వీటివ్యాపారములనెల్ల సాక్షుంగుచుండునతండే సత్యజ్ఞానానంద ఆత్మారాముఁడు.

ద్రావిడవృత్తము.

పూనిలాయ ఐన్దుమాయ్ పునల్కణ్ నిన్ఱ నాన్గుమాయ్
తీనిలాయ మూన్ఱుమాయ్ చ్చిరన్ద కాలిరణ్డుమాయ్
మీనిలాయ దొన్ఱుమాగి వేఱువేఱు తన్మైయాయ్
నీనిలాయ వణ్ణ నిన్నై యార్ నినైక్క వల్లరే.

ద్రావిడకీర్తన. రాగం-భూపాళం-తాళం-అట.

1. బలరామా రవికులరామా భుజబలరామా కోశలరామా- చ్ఛరరామా మనోహరరామా సౌందరరామా ఆయిరనామా॥ రామ॥

2. పళ్లిపాణ్మైయిదట్కుళ్ళై పుగున్దవర్కుం పరమపదం తరుపాయేకో - కళ్లనుమాయ్ నిన్రవిళక్కుంపిడిక్కురా యున్ కపటం ఆరఱివాన్ కర్తావే॥ రామరామా॥

3. ముక్కాడిట్టపిళ్ళై మున్నిన్రపిళ్ళైయల్లాల్ ముపల్ కుట్టిన ప్పిళ్ళైయైయఱియాదే-ఇక్కారియంపోలానైన్రియొన్రెదిర్ కాట్టి యుళ్ళైప్పునైకాణ్బదెప్పోదే॥ రామరామా॥

4. నీదియాంనాళూరు పేరుక్కుళ్ళొరువనైనీక్కియయుళుంవిన్దైపుణ్డాయే-ఆదిమూలమెన్ర నాదత్తిల్ పదంవైక్క ఆనైక్కుమున్నే వన్దాణ్డాయే॥ రామరామా॥

5. కాయిట్ట్రిప్పామ్బెన్ణికళ్కలఙ్గుంవణ్ణంఒరు కరుక్కలుణ్డాగియవగై లే-మయక్కత్తిలేనాఙ్గళ్ మయఙ్గుంవణ్ణమిన్ద మయక్కంకాట్టలామోనెడుమాలే॥ రామరామా॥

6. జాలంతేణ్ణిరసల్ వళివెళియివట్ట్రిన్దు-నాలుమూన్రిరణ్డొన్రాం అధికారా-కోలమానిడంకాట్టిఅళుక్కుళ్ళై యాళాయ్-కుఱుకుఱుక్కిఱదెన్నరఘువీరా॥ రామరామా॥

7. మాయైత్తన్నెప్పడైప్పాయ్ మాయైయుం తుడైప్పాయున్ వల్లమైయఱియాదల్లోభూమి-మాయైక్కుళ్ తిరుమ్బవుం మయక్కంకాట్టినాలున్ మహిమైమైయఱివదెప్పడిసామి॥ రామరామా॥

8. నీయుంసీతైయుంపెట్ట్రితాయుంతన్దైయుమెన్రే-నినైక్కుఱోం నాఙ్గళ్ సదాకాలం - తాయివళ్ మహిమైమై భువిక్కుకాట్టవేణ్డిసామినీ శెయ్దామో ఇక్కోలం॥ రామరామా॥

9. కనవినాలెయెన్ద వ్రయిరుంఉయిరుక్కుళ్లకరుత్తుం నీ తెరివాయోపెరియోనే-జనకికొరుత్తుమాత్రం తెరియాదుపోలిన్ద్రి జాలం శెయ్యలామోనీదానె॥ రామరామా॥

10. అగ్గినిమైయుంశుడుం అగ్గినిసీతై యెన్రగ్గినియతిస్ధపో యువ శ్సూక్షి-ఇక్కో-లంరావణన్ తీణ్డామల్ నిలత్తోజే యెమత్తానే యిదై విడయెఱ్ సాక్షి॥ రామరామా॥

11. తీమైయుంపిఱ్పశొన్న వామైయుంవడవైచ్చెన్ తీమై యుంశుడుం ఇవళ్ ప్రతాపం - వాయ్పులిత్తదో మాజ్గాయ్ పులిత్తదో వెన్రుమనత్తిలెణ్ణినాలుం వెగుపాపం॥ రామరామా॥

12. ఎళ్లుక్కుళ్లెణ్ణైపోలిరుక్కిఱసీతై యిడత్తి లిరుక్కలైయో భర్తావే-ఉళ్ళక్కరుత్తైవళ్లలఱియుమెన్రవార్త్తై యున్నైయల్లవోశొల్లాయ్ కర్తావే॥ రామరామా॥

13. ఎదిరఱక్కరైక్కొణ్రియ్ పదియిలెజ్గళైవైత్తాయిన్ద దయ పునక్కెజ్గెపోచ్చో- మిథిలైవల్లిమైయిజ్గేశోధిత్తా యెజ్గళైవిరున్దిట్టు ప్పగై కాణమనదాచ్చో॥ రామరామా॥

14. ఇఱక్కాగియపొన్నై పుటత్తిల్ వైత్తెడుప్పార్గళ్ ఇవ ళుక్కుణ్డోశొల్లాయ్వ్యత్యాసం - అఱక్కిల్లాత్తజ్గత్తై ప్పుటత్తిల్ వైత్తెడు త్తాయె అయ్యాఉనక్కుమున్డోమతిమోసం॥ రామరామా॥

అని శ్రీరాముని చతుర్ముఖుండు వినుతించినలాగున ఆత్మారాముని సదాస్తుతింపుడని, గురుండుమరల

పైజెప్పిన చతుర్వింశతితత్వములకు ఆత్మయేయాధారము. అనాత్మయగు తత్వసమూహము అనృత జడ దుఃఖ స్వరూపమైనది;ఆత్మసత్తు చిత్తు ఆనందస్వరూపుండు; ఎట్లనిన

నేత్రములందుండి జాగ్రత్ప్రపంచము నెరింగినఆత్మయే సూక్ష్మదేహమున కంఠమునందుండి స్వప్నప్రపంచమును నెరుంగునపుడు స్థూలదేహమును తదవస్థయు స్వప్నమందు లేకపోయెను గనుక స్థూలదేహముఅనృతము; సూక్ష్మదేహమందుండి స్వప్నావస్థ నెరుంగుఆత్మ కారణదేహముతోగూడి హృదయమందునిలిచి సుషుప్త్యవస్థయైన శూన్యము నెరుంగునపుడు సూక్ష్మదేహమును తదవస్థయు సుషుప్తియందు లేక

పోయెను గనుక సూక్ష్మదేహము అనృతము; సుషుప్తి యవస్థయైన కారణదేహమును తదవస్థయు సమాధియందు లేకపోయెను గనుక కారణదేహము అనృతము; ఈ దేహాదులొకప్పుడుండి యొకప్పుడు లేకపోయినా ఆత్మ ఎల్లప్పుడుండుటచేతే ఆత్మ సద్రూపుండు. మరియు దేహత్రయములు ఘటాదులవలె జ్ఞానములేక జడములైయుండును; ఆత్మ ఈజడమయిన దేహాదులను జ్ఞానముగా ప్రవర్తింపఁజేయుచు ఈదేహాదులకార్యములైన జాగ్రత్స్వప్నసుషుప్తులందుండి తద్వ్యాపారముల నెరుంగుచుండుటచేత ఆత్మచిద్రూపుండు; మరియు దేహము హేయమై రోగములుగలదియై చింతకుమూలమై జరామరణాద్యవస్థలుఁగలదియైయుండుటచేత ఈదేహము దుఃఖమయమనఁబడును; ఆత్మయో జననమరణాదులులేనిదియు సుషుప్తి సుఖమునకుమించినసుఖమైనదియు ఇతరసుఖముల నపేక్షింపకుండునదియునగునుగాన ఆత్మ ఆనందస్వరూపుండు. గనుక

ద్రావిడవృత్తము.

అసత్తిలెమ్మట్టుండమ్మట్టుం పరాముఖమాగినాయమ్మట్టుం
నిజత్తిలుళ్ విళ్ళిప్పారైవ్వాయా యిప్పడినిరంతరప్పళక్కత్తాల్
వసత్తిలుఱ మననిన్ను చిన్మాత్తిరవడివమాగిల్ మైన్దా
కళత్త దేహత్తిలిరుక్కినుం ఆనందక్కడల్ వడివాహాయే.

శ్లో॥ దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకం।
ఆత్మన్యేవభవేద్యస్య సనేచ్ఛన్నపిముచ్యతే॥

అనగా స్థూలసూక్ష్మకారణశరీరంబే నేనను ప్రపంచజ్ఞానంబుదృఢముగ సామాన్యులకెట్లున్నదో అటువలె నిట్టిదేహామే ఆత్మయనెడి ప్రపంచజ్ఞానంబునకు బాధకంబగు నేనుబ్రహ్మంబనెడి బ్రహ్మజ్ఞానంబు ఏమహానీయులకు ప్రత్యగాత్మయగు తమయందేగలుగుచున్నదో వారు మోక్షంబపేక్షింపకపోయినను మోక్షంబుపొందుచున్నారు. అయితే జ్ఞానియు యితరులవలె దేహవంతుఁడై కర్మంబులం జేయుచున్నందున

కర్మబద్ధుఁడగు నేగాని ముక్తుఁడుగాడని శంకింప, కర్మంబు అజ్ఞానజన్య కార్యంబు; కారణంబగు అజ్ఞానంబు జ్ఞానాగ్నిచే కాలిసందున, కార్యం బగుకర్మంబుచే బద్ధుఁడుగాడని భగవంతుడే ఆనతిచ్చియున్నారు.

ఎందువల్లననగ,

శ్లో॥ సత్యజ్ఞానానందపూర్ణ లక్షణం తమసఃపరం।
బ్రహ్మానందంసదాపశ్యన్ కథంబధ్యేతకర్మణా ॥

అనగా అఖండసచ్చిదానందలక్షణంబై అజ్ఞానాంధకారంబున కంటె విలక్షణంబైనబ్రహ్మంబుతానను ఆనందమునెల్లప్పుడు అనుభవిం చుచున్నవాడై పుణ్యపాపకర్మములచేత నెట్లు బంధింపబడును? అనగా బంధింపఁబడడు.

పద్యం॥ ఆపాపలవిహారణములుతీపులుపుట్టింపమఱియున్ తేకువ లేక। ఆగోపాలసతులువుస్కువ। నేపనులుమఱచియుండిరీక్షణపరులై॥

అనగా బ్రహ్మవిద్యాభ్యాసులు ప్రకృతిపురుషుల విచారణలు నిరతిశయానందమును పుట్టింపుచుండగా జననమరణాదిభయములు లేని వారై బ్రహ్మనిష్ఠయందలి ప్రేమచేత సద్గురునియేవీక్షించుచు చతుర్ద శేంద్రియవ్యాపారంబులను మఱచియుండు నపుడు, గురుంసుమరల

శ్లో॥ ఆత్మానంరథినంవిద్ధి శరీరంరథమేవతు।
బుద్ధించసారథింవిద్ధి మనఃప్రగ్రహమేవచ॥

2. ఇంద్రియాణిహయాన్యాహుః విషయాంతేషుగోచరాన్।
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిభిః॥

అనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములనెడుగుఱ్ఱములును సంకల్ప వికల్పాత్మకమనస్సనెడుపగ్గమును శబ్దాదివిషయములనెడు సంచారస్థళ మును బుద్ధియనెడిసారథియు ప్రాణాదిదశవాయువులనెడు యిరుసును ధర్మ అధర్మములనెడు చక్రములుఁగల శరీరమనెడురథమువీూద అకర్త అభోక్త అసంగుఁడునునైన ఆత్మారాముఁడు కర్తభోక్త సంగుఁడు అను అభిమానముగలవానివలె తోపింపఁజేయుచుకూర్చుండి సర్వేంద్రియ

